




# రుచిగా
# చల్లగా
# తియ్యగా వుండే

# పార్లే

## ఎక్స్‌ట్రా-స్ట్రాంగ్
## పెప్పరమింట్లు

9 పెప్పరమింట్లు ఉండే ప్యాకెట్
ఎంతో తక్కువ ధరకు లభిస్తాయి
మాధుర్యమైన ఆహ్లాదమునకు
ఆహ్లాదకరమైన మాధుర్యమునకు






everest/981/PP tel


కుటుంబ సమేతంగా
తప్పక చూడండి!
శ్రీకాంత్ ప్రొడక్షన్స్
మారిన మనిషి
నిర్మాతలు: ఎస్. ఎల్. నహాతా - ఎస్. సౌందప్పన్.
దర్శకత్వం: సి. యస్. రావు B.A.(LITT)
రాజశ్రీ విడుదల



# వివా

రెండు విధములుగా ఆరోగ్యమును కలిగించే పానీయము

## పగలంతా ఎంతో శక్తి...
## రాత్రంతా సుఖమైన విశ్రాంతి



ప్రొద్దున్న వివా త్రాగుతే... రోజంతా ఉత్సాహముగా ఉంటారు! మాల్ట్, గోధుమ మరియు ప్రోటీనులతో వివాలోని పూర్తి మీగడగల పాలు పుష్టివంతముగా చేయబడినవి.

రాత్రి **వివా** త్రాగుతే... రాత్రంతా గాఢముగా నిద్రపడుతుంది! వివా యొక్క పసందైన రుచి మరియు దానిలోని పోషకవంతమైన పదార్థములు స్నాయువులను బలపరుస్తాయి, నరములకు ఉపశమనమును కలిగిస్తాయి, కండరములకు సేదదేరుస్తాయి.

**వివా** సులభముగా జీర్ణమవుతుంది... రోగులకు మరియు రోగమునుండి కోలుకొంటున్న వారికి ప్రత్యేకముగా సిఫార్సుచేయబడినది.

ఆరోగ్యమునకు త్రాగండి **వివా!**
నీళ్లలో లేక పాలలో దాని రుచి అహా!







భారతదేశములో తయారుచేయువారు:
జగత్‌జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్,
జగత్‌జిత్ నగర్, హమీర (పంజాబ్)

సోల్ సెల్లింగ్ ఏజెంట్లు:
హోమ్ ప్రొడక్ట్స్ మార్కెటింగ్ ఏజెన్సీ.
ఎ డివిజన్ ఆఫ్ సారాభాయ్ సన్స్ ప్రైవేట్ లిమిటెడ్.

shilpi j.i-la/70 tel.

చూడండి, మీకే తెలుస్తుంది...

# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్ !

ఫలితములను చూడండి. బట్టలను ఆఖరు సారి జాడించునపుడు కొంచెము టినోపాల్ వేయండి. అప్పుడు చూడండి. బట్టలు ఎంత తెల్లగా, కళ్లు మిరుమిట్లుగొలిపేలా ఉన్నాయో! టినోపాల్ ఎంత తెల్లగా చేస్తుంది! మీ చొక్కాలు, చీరలు, దుప్పట్లు, తువాళ్లు మొదలైనవి మెరుస్తూ ఉంటాయి!

దానికయే ఖర్చు? బట్టకు ఒక పైసా కూడ కాదు! టినోపాల్‌ను కొనండి. రెగ్యులర్ ప్యాక్, మితవ్యయ ప్యాక్ మరియు బాల్చీకి సరిపోయే పొట్లము—మూడు ప్యాకింగులలో లభిస్తోంది.







® టినోపాల్ జె.ఆర్. గైగి ఎస్.ఏ. బాసెల్ స్విట్జర్లెండ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

సుహృద్ గైగి లిమిటెడ్, పి.ఒ. బాక్సు 11050, బొంబాయి 20 బి.ఆర్.

Shilpi HPMA 12A/70 Tel





# కానుక

## జీవిత వినోద సంధాయిని




# క్లిక్ III

రూ 46.50 (పన్నులు అదనం)

**ప్రారంభించటానికి మంచిది. తరువాతఅనుక్షణం కూడా ఉంచు కొనుటకు ఉత్తమం**

క్లిక్ III తో మీబిడ్డను ఛాయా చిత్ర జగతికి పరిచయం చేయండి. దానిని ఉపయోగించటం చాలా సులభం. అడ్జెస్టు చేయవలసిన అవసరం లేదు. మీరు చేయ వలసిన పనల్లా వస్తువును సరిచూడటం. మీట నొక్కటం! ఇది ఎంతో పొదుపైనది కూడాను. రంగులలో కాని తెలుపు నలుపుల లో కాని ప్రతి 120 ఫిలిము రోలుకు సుస్పష్టమైన 12 చిత్రాలను తీయ వచ్చును

ఆగ్ఫా-గెవార్ట్ వారి సహకారంతో తయారుచేయువారు:
ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్....బరోడా




సోల్ డిస్ట్రిబూటర్లు :
ఆగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్
బొంబాయి • న్యూ ఢిల్లీ • కలకత్తా • మద్రాసు.

® ఫొటోగ్రఫిక్ ఉత్పత్తుల నిర్మాతలు ఆగ్ఫాగెవార్ట్ అంట్‌వెర్ప్ లివెర్కుసెన్ వారి యొక్క రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

**ఆగ్ఫా క్లిక్-భారతదేశంలో విస్తార ప్రజాదరణంకల కెమేరా** CMAG-138-203 TL



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంచికలో ''రాతిరథం'' అనే కొత్త రంగుల బొమ్మ సీరియల్ ప్రారంభ మవుతున్నది.

''జన్మసాఫల్యం'' అన్న [బేతాళ] కథ ఒక విషయం స్పష్టం చేస్తుంది: ప్రాణులు ఉన్నతదశ అందుకోవటానికి అడ్డదారులు లేవు.

''భూతాలబెడద'' అన్న కథలో కూడాఇంచుమించుఅలాటి నీతే ఉన్నది: పాపఫలితంగా పిశాచజన్మ ఎత్తిన తరవాత ఆ జన్మలు తేలికగా వదలవు. అవి చేసే ''మంచి'' పనులు ఫలించవు.

సంపుటి 47 అక్టోబర్ '70 సంచిక 4

CHITRA




# మాంత్రికులదీవి

తూర్పు తీరాన ఒక గ్రామంలో కేశవు డనే పేద యువకుడు ఉండేవాడు. వాడు ద్వీపాంతరాలకు వెళ్ళి డబ్బు సంపాదించు కుందామనుకుని, ఒక వర్తకపు ఓడలో బయలుదేరాడు.

ఆ ఓడ సముద్రం మీద కొద్ది రోజులు ప్రయాణం చేశాక ఒక భయంకరమైన ఉప్పెన వచ్చింది. ఓడ మునిగిపోయింది. మిగిలిన ప్రయాణీకులు ఏమయారో తెలియ లేదు. కేశవుణ్ణి మాత్రం ఉప్పెన కెరటాలు ఒక దీవి మీదికి తెచ్చి పడేశాయి.

ఆ దీవిలో ఒక మనిషి గాని, ఒక పక్షి గాని, ఒక జంతువు గాని లేదు. ఎక్కడ చూసినా కొబ్బరిచెట్లున్నాయి. వాటి నిండా కాయలున్నాయి. ఆ కాయలు కోసుకు తిని పొట్టపోసుకోవటం తప్ప కేశవుడికి మరొక మార్గం కనిపించలేదు. అందుచేత వాడు ఒక కొబ్బరిచెట్టు ఎక్కాడు.

అప్పుడు వాడి కొక అద్భుతం కన బడింది. ఒక పెద్ద అడవిపంది గాలిలో తేలుతూ ఆ దీవి కేసి వస్తున్నది. కేశవుడు తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. ఆ పందికి రెక్కలన్నా లేవు. అది గాలిలో తేలుతూ వచ్చి దీవి మీద వాలి, ఎండ పొడలో పడుకుని, పెద్దగా గురక పెడుతూ నిద్ర పోసాగింది.

కేశవుడు చెట్టు నుంచి దిగి వచ్చి ఆ పందిని పరీక్షించాడు. అది మామూలు పందిలాగే ఉన్నది. అయితే దాని నోట బలమైన కోరలున్నాయి. ఆ పంది పక్కనే చాలా పెద్ద వజ్రం ఒకటి ఉన్నది. ఆ వజ్రాన్ని ఆ పందే, నోటకరుచుకుని తెచ్చి ఉండాలి.

కేశవుడు ఆ వజ్రాన్ని ఎత్తి పరీక్షించాడు. అంత పెద్ద వజ్రాన్ని వా డెన్నడూ చూడలేదు.

ఎస్. వీరభద్రరావు



"ఈ దీవి నుంచి వెళ్ళి పోగలిగితే నా దరిద్రం తీరటానికి ఈ వజ్రం చాలు." అనుకున్నాడు కేశవుడు.

అంతలో ఆ పంది గురక పెట్టటం మాని నిద్రలేచే లక్షణాలు ప్రదర్శించింది.

"అయ్యో, ఈ పంది నన్ను చంపేస్తుంది కాబోలు! చెట్టు మీదనే ఉండిపోతే ఎంత బాగుండేది!" అనుకున్నాడు వాడు.

ఈ మాట మనసులో అనుకోవటమే తడవుగా కేశవుడు గాలిలో లేచి కొబ్బరి చెట్టు మట్టల మధ్య వాలాడు.

"ఈ వజ్రంలో ఏదో మహిమ ఉన్నది. ఇది పట్టుకుని ఏది కోరుకుంటే అది జరుగుతుందిలాగుంది. దీని మహిమ వల్లనే పంది గాలిలో తేలుతూ వచ్చింది," అనుకున్నాడు కేశవుడు.

ఈ లోపల పంది లేవనే లేచింది. అది, కేశవుడున్న చెట్టు కిందికి వచ్చి, తల ఎత్తి చూసింది. కేశవుడి చేతిలోని వజ్రం దానికి కనిపించింది. వెంటనే అది భయంకరంగా గర్జించింది.

కేశవుడు ఒక బరువైన కొబ్బరికాయ కోసి, బలం కొద్దీ పంది ముట్టె మీద విసిరాడు. ఆ దెబ్బకు పంది మూర్ఛపోయింది. అదే సమయమనుకుని కేశవుడు వజ్రం




సహాయంతో కిందికి దిగి వచ్చి, పెద్ద రాయితో పంది తల చితకగొట్టి, దాన్ని చంపేశాడు.

ఆ పంది ఒక మాంత్రికుడు. వాడికి పంది రూపంలో గాలిలో తిరగటం సరదా. కేశవుడు తనకు తెలియకుండానే ఒక మాంత్రికుణ్ణి చంపేసి, వాడి శక్తులకు మూలమైన వజ్రాన్ని సంపాదించుకున్నాడు. ఆ దీవిలో ఇంకా ఇతర మాంత్రికులున్నారు. ఆ సంగతి కూడా వాడికి తెలియదు.

అయితే కోరినది ఇవ్వగల వజ్రం చేతికి రావటంతో కేశవుడి భయాలన్నీ తీరిపోయాయి. వాడికి ఆ దీవి అంతా తిరిగి





చూడాలనిపించింది. వాడు కూడా గాలిలో తేలుతూ దీవి లోపలి భాగం కేసి బయలుదేరాడు.

దూరాన వాడికి పొగ కనిపించింది. అక్కడ ఎవరో ఉన్నారు. వాళ్ళను చూద్దామని కేశవుడు అటుగా వెళ్లాడు.

అక్కడ ఒక గుడిసె ఉన్నది. దాని ముందు కాళ్ళులేని వా డొకడు కూర్చుని, నిప్పుల్లో మేకపిల్లను కాలుస్తున్నాడు.

కేశవుడు ఆ కాళ్ళులేనివాణ్ణి సమీపించి, "అయ్యా, నాకు కాస్త తిండీ, రాత్రికి పడుకునేటందుకు చోటూ ఇప్పించగలరా?" అని అడిగాడు.

"నా కున్న దానిలోనే నువూ తిను," అంటూ కాళ్లులేనివాడు తాను కాల్చుకున్న మేకపిల్లలో కేశవుడికి భాగం పెటాడు.

కాని ఆ మనిషి తన కేసి చూసే చూపులను చూస్తే వాడు తనను కూడా కాల్చుకు తినేవాడిలాగే కనిపించాడు కేశవుడికి.

తిండి తినటం అయాక ఆ మనిషి కేశవుణ్ణి, "నువ్విక్కడికి ఎలా వచ్చావు?" అని అడిగాడు.

కేశవుడు తన కథ అంతా చెప్పి, తన చేతిలో ఉన్న వజ్రాన్ని చూపాడు.

"కాళ్లు లేనివాణ్ణి. కదలలేకుండా ఉన్నాను. నా కా వజ్రం ఇచ్చావంటే నేను నీకు మహిమ గల గొడ్డలి ఇస్తాను. దాని పిడి మీద కొట్టి, 'నిప్పుచెయ్యి' అంటే అది వెళ్ళి కట్టెలు కొట్టి తెచ్చి, నిప్పు చేస్తుంది. దాని తల మీద కొట్టి, 'తల తియ్యి!' అంటే ఎదటి ప్రాణి తలతీస్తుంది," అన్నాడు కాళ్ళులేని మాంత్రికుడు.

"సరే, మారకం నా కిష్టమే!" అని కేశవుడు తన వజ్రాన్ని ఒక చేత్తో ఇస్తూ, రెండో చేత్తో గొడ్డలి తీసుకున్నాడు. వెంటనే వాడు గొడ్డలి తల మీద కొట్టి, "తల తియ్యి!" అన్నాడు. మరుక్షణం ఆ గొడ్డలి కాళ్ళులేని వాడి తల నరికేసింది.

కేశవుడు జాగ్రత్తపడటం మేలే అయింది. లేకపోతే ఆ కాళ్ళు లేని మాంత్రికుడు వజ్రం సహాయంతో వాణ్ణి మంటలో వేసి ఉండేవాడే.

మరొక మాంత్రికుణ్ణి చంపటమే గాక, వజ్రంతోబాటు గొడ్డలి కూడా సంపాదించి కేశవుడు సూర్యాస్తమానం అయేసరికి మరొక గుడిసె వద్దకు వచ్చాడు. దాని బయట చేతులు లేనివాడొకడు కూర్చుని ఉన్నాడు. వాడి పక్కన ఒక చిన్న అరుగూ, దాని మీద ఒక చట్టీ ఉన్నాయి.

ఈ చేతులు లేనివాడు తనను సమీపిస్తున్న కేశవుణ్ణి చూసి కంగారుపడుతూ, గడ్డంతో చట్టిని పక్కకు తోశాడు. ఆ చట్టిలో ఉన్న పాలు కిందికి దొర్లి, మహాప్రవాహమై కేశవుడి కేసి పారసాగాయి. అంత కంతకూ అది ఒక పెద్ద వరదలాగా అయి, చేతులు లేనివాడి గుడిసె చుట్టూ ఉన్నచోటును ముంచసాగింది.

మామూలుగా అయితే కేశవుడు ఆ ప్రవాహంలో మునిగిపోవలిసినవాడే, కాని వజ్రం సహాయంతో వాడు గాలిలోకి లేచి, చేతులు లేనివాడి పక్కన వాలాడు.

చేతులు లేనివాడు ఆశ్చర్యంతో, "ఇదేం విద్య?" అన్నాడు.

కేశవుడు తన వజ్రం చూపించి, "ఇది ఉంటే కోరినదెల్లా చెయ్యవచ్చు." అన్నాడు.






"నా చట్టి తీసుకుని నాకా వజ్రం ఇయ్యి. ఈ మంత్రపు చట్టి కోరిన ఆహారం ఇస్తుంది. దీన్ని బోర్లించి దేశాలకు దేశాలే ముంచి పారెయ్యవచ్చు," అన్నాడు వాడు.

కేశవుడు తన వజ్రాన్ని వాడికిచ్చి చట్టి చేతులోకి తీసుకుంటూ, గొడ్డలి తల మీద కొట్టి, "తల తియ్యి!" అన్నాడు. మరుక్షణం చేతులులేని వాడి తల పడిపోయింది.

కేశవుడికి వజ్రంతో, గొడ్డలితో బాటు చట్టి కూడా వచ్చింది. ఆ రాత్రికి వాడు చేతులు లేనివాడి గుడిసెలోనే పడుకుని, మర్నాడు లేచి రోజల్లా తిరిగి, సాయంకాలానికి ఒక అరణ్యాన్ని సమీపించాడు.



ఆ అరణ్యంలో నుంచి తప్పెట చప్పుడు భయంకరంగా వినవస్తున్నది. అరణ్యంలోని ఏనుగులూ, సింహాలూ, పులులూ, ఇతర మృగాలూ ఆ ధ్వని విని బెదిరి, మందలు మందలుగా పారిపోతున్నాయి.

చప్పుడు కొంత సేపటికి ఆగిపోయింది. కేశవుడు ఆ దిక్కుగా వెళ్ళాడు. చెట్లమధ్య ఖాళీస్థలంలో ఒక రాక్షసాకారుడు కూర్చుని ఉన్నాడు. వాడి ముందు డోలులాటిది ఉన్నది. వాడు కేశవుణ్ణి చూస్తూనే, "ఏయ్, భోజనానికి రా!" అని పిలిచాడు.

"అలాగే!" అంటూ కేశవుడు ఆ రాక్షసుడికి సాధ్యమైనంత దూరంగా చతికిలబడ్డాడు. రాక్షసుడు కేశవుడికి మాంసం కూర ఇవ్వబోయాడు. అది నరమాంసమని కేశవుడికి అనుమానం కలిగింది.

"నేను శాకాహారిని. మాంసం తినను," అంటూ వాడు తన చట్టి నుంచి ఆహారం తినసాగాడు.

"అదేం చట్టి?" అని రాక్షసుడు అడిగాడు.

"ఇందులో ఏది కాలంటే ఆ ఆహారం దొరుకుతుంది." అన్నాడు కేశవుడు.

"ఆ చట్టి నాకిచ్చి నా డోలు తీసుకో. ఇది మంత్రపుడోలు. దీన్ని ఒకపక్క వాయిస్తే



ఎలాటి ప్రాణులూ భయపడి పారిపోతాయి. రెండోపక్క వాయిస్తే అంతులేని సేనలు పుట్టుకొచ్చి నిన్ను రక్షిస్తాయి," అన్నాడు రాక్షసుడు.

"సరే," అంటూ కేశవుడు రాక్షసుడికి చట్టి ఇచ్చి డోలు తీసుకుని, తన గొడ్డలితో రాక్షసుడి తల నరికేశాడు.

వజ్రమూ, గొడ్డలీ, చట్టీ, డోలూ సంపాదించుకున్న కేశవుడు చాలా దేశాలు తిరిగి ఒక రాజ్యం చేరాడు. ఆ దేశపురాజు వట్టి పాపాత్ముడు. అతను తన ప్రజలనే దోచి, చంపించేవాడు; దేశానికి కొత్తవాడు ఎవడు వచ్చినా పట్టితెప్పించేవాడు.

కేశవుడు ఆ దేశంలో అడుగు పెట్టగానే పన్నెండుమంది భటులు అతన్ని పట్టుకోవటానికి వచ్చారు. కేశవుడు డోలు ఒకపక్క వాయించేసరికి వాళ్ళు బెదిరి పారిపోయారు.

ఇదితెలిసి రాజు కేశవుడి పైకి సైనికులను పంపాడు. కేశవుడు మళ్ళీ డోలు వాయించి వాళ్ళను కూడా పారదోలాడు. ఈ సారి రాజు తన సైన్యాన్ని మొత్తంగా పంపాడు. కేశవుడు తన చట్టి బోర్లించి వరదలు పుట్టించాడు. సైన్యమంతా ఆ వరదలో పడి కొట్టుకుపోయింది.

రాజు ఒంటరిగాడయి పోయాడు. కేశవుడు రాజున్న చోటికి వెళ్ళి, తన గొడ్డలి తలను తట్టి, "తల తియ్యి!" అన్నాడు.

రాజు తల ఎగిరిపోయింది.

ప్రజలు సంతోషించి కేశవుడికి రాజ్యాభిషేకం చేశారు.

"మన దేశానికి సైన్యంలేకుండా పోయింది. ఎలా?" అన్నారు మంత్రులు కేశవుడితో.

కేశవుడు డోలు రెండోపక్క కొట్టి అంతులేని సేనలను సృష్టించాడు.

మంత్రులు సంతోషించారు. అంత సేనను అంత సులభంగా సృష్టించే రాజుండగా తమ దేశానికి శత్రుభయం ఉండదని వాళ్ళు గ్రహించారు.






శశీ దివసధూసరో, గళితయౌవనా కామినీ,
సరో విగతవారిజం, ముఖ మనక్షరం స్వాకృతేః,
ప్రభు ర్ధనపరాయణః, సతతదుర్గతి స్సజ్జనో,
నృపాంగణగతః ఖలో, మనసి సప్తశల్యాని మే. 1

[కాంతిహీనుడైన పగటి చంద్రుడూ, యౌవనం ఉడిగిన స్త్రీ, తామరలు లేని సరస్సూ, చదువు లేని అందగాడూ, ధనాశ గల రాజూ, అదృష్టహీనుడైన మంచివాడూ, రాజు పంచన చేరిన దుర్మార్గుడూ నా మనస్సును (శల్యాల వలె) బాధిస్తారు.

న కశ్చి చ్చండకోపానా మాత్మీయో నామ భూభుజాం,
హోతార మపి జుహ్వానం స్పృష్టో దహతి పావకః. 2

[చండకోపులైన రాజులకు దగ్గిర వాళ్ళంటూ ఉండరు. అగ్నిహోత్రుడు తనకు హోమం చేసేవాడి చెయ్యే అయినా, తగిలితే కాలుస్తాడు గద!]

ఆరంభగుర్వీ క్షయిణీ క్రమేణ లఘ్వీ పురావృద్ధి ముపైతి పశ్చాత్,
దినస్య పూర్వార్ధ పరార్ధ భిన్నా ఛాయేవ మైత్రి ఖలసజ్జనానాం. 3

[దుర్మార్గుల స్నేహం ఉదయపు నీడవలె మొదట జాస్తిగా ఉండి రాను రాను తరిగి పోతుంది. సజ్జన స్నేహం సాయంకాలపు నీడలాగా మొదట స్వల్పంగా ఉండి రాను రాను పెరుగుతుంది.]

దుర్జనులు



పూర్వం ఖడ్గవర్మ, జీవదత్తుడు అనే క్షత్రియయువకు లిద్దరు దేశాటన చేస్తూ, ఒక రాత్రివేళ శూరపురనగర ప్రాంతాన గల అరణ్యం చేరారు. ఆ రాత్రి నిద్రించేందుకు అనువైన చోటు కోసం వెతుకుతూండగా, అదృష్టవశాన వాళ్ళకు అల్లంత దూరంలో మినుకు మినుకుమంటూ చిన్న వెలుగు కనిపించింది. ఆ వెలుగు కనిపించే చోట ఎవరో మనుషులున్నారన్న సంగతి తెలియగానే, వాళ్ళెవరై వుంటారన్న సంశయం వాళ్ళిద్దరికీ కలిగింది. అక్కడ ఏ కట్టెలు కొట్టేవాడో నివసిస్తూండవచ్చు; అలాకాక ఏ బందిపోటు దొంగలో, మంత్ర తంత్ర విద్యలు నేర్చిన దుష్టమాంత్రికులో వుండవచ్చు.

ఇద్దరికీ ఒకే విధమైన సంశయం కలగటంతో, ఆ యువకులిద్దరూ కొంచెం సేపు ఆ వెలుగు కేసి చూస్తూ మౌనంగా వూరుకున్నారు. తరవాత జీవదత్తుడు ఏదో చెప్పబోయేంతలో, ఖడ్గవర్మ ముందుకు అడుగు వేయబోయాడు. జీవదత్తుడు అతడి భుజం పట్టుకు ఆపి, "ఏమి చేయబోతున్నావ్? అక్కడికి వెళదామంటావా? కావాలంటే యిక్కడ ఏ చెట్టు కిందనైనా స్థలం శుభ్రపరుచుకుని, సుఖంగా తెల్లవార్లూ నిద్రపోవచ్చు," అన్నాడు.

"హాయిగా రాత్రి వెళ్ళబుచ్చటానికి ఇల్లేదో కనిపిస్తూండగా, చెట్ల కింద పడుకునే అవస్థ ఎందుకు? అక్కడ వున్నవాళ్ళు ఆహ్వానించినా, లేక ఎదురు తిరిగినా మన




కొచ్చే నష్టం ఏమీలేదు. ఆహ్వానిస్తే మిత్రుల్లా ఇంట ప్రవేశిస్తాం. ఎదురు తిరిగితే తరిమి కొట్టి ఇల్లాక్రమిస్తాం," అన్నాడు ఖడ్గవర్మ.

ధైర్య సాహసాల్లో, బల పరాక్రమాల్లో ఆ ఇద్దరు క్షత్రియయువకులూ సమఉజ్జీలు. పోతే ఖడ్గవర్మది వేగిరపాటు తత్వం, జీవదత్తుడిది శాంతస్వభావం.

యువకులిద్దరూ నిశ్శబ్దంగా నడుస్తూ పోయి ఆ వెలుగు వస్తున్న చోటుచేరారు. అక్కడ వారి కొక చిన్న పూరి ఇల్లు కనిపించింది. ఆ ఇంటి కిటికీ లోంచి దీపపు కాంతి బయిటికి వస్తున్నది. జీవదత్తుడు ఇంటి తలుపు దగ్గిరకు పోయి మెల్లిగా తోసి



చూశాడు. దానికి లోపల గడివేసి వున్నది. ఈ లోపల ఖడ్గవర్మ కిటికీ దగ్గిరకు పోయి లోపలికి తొంగి చూశాడు. లోపల వృద్ధు డొకడు నిద్రపోతున్నాడు.

ఖడ్గవర్మ, జీవదత్తుడి దగ్గిరకు తిరిగి వచ్చి చిన్న గొంతుతో, "లోపల వృద్ధు డెవరో నిద్రపోతున్నాడు. రాత్రి యింకా రెండు జాములైనా కాందే, తలుపు బిగించుకుని సుఖంగా నిద్రపోయే యిత డెవరై వుంటాడు?" అన్నాడు.

"పరుల కెవరికీ హాని చేయనివాడూ, పగలల్లా కష్టపడి పనిచేసేవాడూ అయి వుంటాడు. సందేహం లేదు. నీ కత్తినిక ఒరలో పెట్టు; తలుపు తడదామా?" అన్నాడు జీవదత్తుడు.

"అంతకాక మరిచేయగలిగిందేముంది!" అంటూ ఖడ్గవర్మ గట్టిగా తలుపు తట్టాడు.

ఆ ధ్వనికి లోపల నిద్రిస్తున్న వృద్ధుడు మేల్కొని తలుపు తెరిచాడు. ఖడ్గవర్మా, జీవదత్తుడూ అతడికి నమస్కరించారు. "అయ్యా, మేం బాటసారులం. ఈ రాత్రికి యిక్కడ పడుకునేందుకు అనుమతిస్తారా?" అని అడిగాడు. జీవదత్తుడు.

వృద్ధుడు నవ్వుతూ యిద్దర్నీ లోపలికి ఆహ్వానించి, "ఈ రాత్రే కాదు, మరెన్ని





రాత్రులైనా మీ రిక్కడ నిద్రించవచ్చు. కాని మిమ్మల్ని చూడబోతే కలయింటి బిడ్డల్లా వున్నారు. పడుకునేందుకు నా దగ్గిర గొంగళి తప్ప మరేం లేదు," అన్నాడు.

"ఆ గొంగళే యివ్వండి, మేం మా ప్రయాణాల్లో చెట్ల కిందా, కొండకోనల్లో కటిక శిలల మీదా పడుకుని నిద్రపోయిన రోజులున్నవి," అన్నాడు జీవదత్తుడు.

వృద్ధుడు వాళ్ళకు చెరొక గొంగళీ యిచ్చాడు. వాళ్ళు వాటిని నేల మీద పరుచుకుని పడుకోబోయేంతలో అతడు, "ఇంత చిన్న వయసులో దేశాటనకు ఎందుకు బయలుదేరారు? ఇందులో మీరాశించిన ప్రయోజనం ఏమిటి? కీర్తా? ధనమా?" అని అడిగాడు.

"ఆ రెండూ ఒకదాన్నొకటి అంటి పెట్టుకుని వుంటవి. అందులో ఏ ఒకటి లభించినా, రెండవదీ సమకూరినట్టే. ఉన్న ఊళ్లో సుఖంగా జీవించే తెరువు లేక, దేశాటన ప్రారంభించాం. మా శక్తి సామర్థ్యాలు, ఈ ప్రాంతపు ఏలిక అయిన పద్మసేనమహారాజు దగ్గిర ప్రదర్శించాలని, పద్మపురం పోతున్నాం," అన్నాడు జీవదత్తుడు.

వృద్ధు డా మాటలకు సంతోషిస్తున్నవాడిలా నవ్వి, "నేను ఆ మహారాజుగారి




పశువుల కాపరిని. ఆయన రేపు, ఈ ప్రాంతాలకు వేటాడ వస్తున్నారు. మీ మీ శక్తి సామర్థ్యాలను చూపేందుకు చాలా అనుకూలంగా వుంటుంది. కాని...." అంటూ జీవదత్తుణ్ణి నఖశిఖ పర్యంతం ఒకసారి పరీక్షగా చూసి, "నీ మిత్రుడు ఖడ్గధారి. నువ్వో చేత దండం పట్టుకుని, తల మీద శిఖతో క్షత్రియ లక్షణాలు లోపించినట్టు కనబడుతున్నావు. ఆ కొయ్యదండంతో మహారాజు ముందు నువ్వే వీరోచిత కార్యాలు చేయగలవు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు జీవదత్తుడు జవాబేమీ యివ్వకుండా కొంచెంగా తల పక్కకు తిప్పు





కున్నాడు. ఆ క్షణం వరకూ మౌనంగా వుండి ఆ సంభాషణ అంతా వింటున్న ఖడ్గవర్మ, "తాతా! నా మిత్రుడి బలశౌర్యాలను శంకించకు. అతడు బుద్ధిబలంలోనూ, దేహబలంలోనూ కూడా నా కన్న మిన్న. అతడి వేషంలో క్షత్రియయువకుడి లక్షణాలు లోపించటానికి వేరే కారణం వున్నది," అని చెప్పాడు.

"అది తెలియనందువల్ల, ఏదో ప్రశ్నించాను, ఏమీ అనుకోకండి. యువరాణి పద్మావతి సంగతి నే చెప్పటం ఎందుకు? మీకే తెలుస్తుంది. సరే, మీకు తినటానికి పెట్టేందుకు యిప్పుడు రొట్టెముక్క కూడా



లేదు....కాని, కావలసినన్ని పండ్లూ ఫలాలూ వున్నవి," అని వృద్ధుడు గదిలో ఒక మూల నున్న పెద్ద బుట్టలో నుంచి కొన్ని పళ్ళు తెచ్చి వారి ముందుంచాడు.

ఖడ్గ, జీవదత్తులు వృద్ధుడికి తమ కృతజ్ఞత చెప్పుకుని, ఆ ఫలాలు భుజించి గొంగళ్ళ మీద పడుకుని తెల్లవారు జాము వరకూ సుఖంగా నిద్రపోయారు. తూర్పు తెల్లనవుతూండగా వృద్ధుడు లేచాడు. అతడితోపాటు వాళ్ళిద్దరు కూడా లేచి కాల కృత్యాలు తీర్చుకుని, దాపుల నున్న కొలనులో స్నానం చేసి, దుస్తులు ధరించి, వృద్ధుడు పెట్టిన రొట్టెలు తిన్నారు.

ఒకటి రెండు బారల పొద్దెక్కేసరికి దూరంగా అరణ్యంలో కలకలం బయలుదేరింది. వృద్ధుడు ఆ కలకలం వస్తున్న వైపుకు చేయి చూపి, "అదుగో, మహారాజు గారు వేటకు వెళుతున్నారు. ఆయన వేటాడబోయే ప్రాంతాన సింహాలకూ, పులులకూ కొదవలేదు. ఇది మీకు మంచి అవకాశం. ఇక, నా పని మీద నేను పోతున్నాను," అన్నాడు.

ఖడ్గ, జీవదత్తులు వెంటనే కదిలి పద్మసేనమహారాజు పరివారం వెనకగా బయలుదేరారు. మహారాజూ, మంత్రీ, మరికొందరు



రాజోద్యోగులూ గుర్రాల మీద వున్నారు. అయన భటుల్లో కొందరు విల్లంబులూ, మరికొందరు ఈటెలూ ధరించి వున్నారు. మిట్టమధ్యాహ్నం వేళకు కొంచెం ముందుగా, అంతా ఒక కీకారణ్య ప్రాంతం చేరారు.

రాజు గుర్రం మీద వుండి తనకు కని పించిన పులులనూ, అడవి పందులనూ తరిమి తన చేతిలో వున్న ఈటెతో కొట్ట సాగాడు. ఒకోసారి ఏదైనా పులి గర్జిస్తూ ఎదురు తిరిగినప్పుడు ఆయన ఎక్కి వున్న గుర్రం బెదిరి పక్కకు పరిగెత్తేది. అలాంటి సమయాల్లో, మంత్రి సోమదేవుడు గాని, అయన వెన్నంటి వున్న రాజోద్యోగుల్లో ఎవరో ఒకరు గాని బాణం కొట్టి దాన్ని వధించేవాళ్ళు.

ఖడ్గవర్మా, జీవదత్తుడూ రాజపరివారంలో కలిసి, పారిపోయే పులులనూ, సింహాలనూ కాక; కోపంతో రెచ్చిపోయి తమ మీదికి దూకబోయే వాటిని మాత్రమే వేటాడ సాగారు. ఖడ్గవర్మ అవకాశం చిక్కినప్పుడు పులులా సింహాలా వెనక కాళ్ళను తన ఎడమచేత్తో పట్టుకుని, కుడిచేత నున్న కత్తితో వాటి తలలు నరికేవాడు. జీవదత్తుడు తన మీదికి దూకబోయే క్రూరమృగా లను చేత నున్న దండంతో గట్టిగా మోది చంపేవాడు.








ఈ ఇద్దరు అపరిచిత యువకుల ధైర్య సాహసాలూ, నైపుణ్యం రాజుగారి పరివారంలో చాలామందిని ఆశ్చర్యపరిచినై. కాని, వేట ఉత్సాహంలో ఎవరూ యీ సంగతి రాజుకు చెప్పలేదు. అందరికన్న ముందు పద్మసేనమహారాజూ, కొంచెం వెనగ్గా మంత్రి సోమదేవుడూ గుర్రాలను దూకిస్తూ ముందు పోతున్నారు. వారికి హఠాత్తుగా ఒక గుబురు పొదలోంచి సింహగర్జన వినిపించింది. సింహం పొద నుంచి బయట పడుతుందన్న నమ్మకంతో రాజూ, మంత్రీ ఈటెలను ఎత్తిపట్టుకుని సిద్ధంగా వున్నారు. కాని, వారనుకున్నట్టు ఆ పొదలోంచి ఒక సింహం కాక, రెండు సింహాలు ఒకేసారి వాళ్ళ గుర్రాల మీదికి లంఘించినై.

పద్మసేనరాజూ, సోమదేవుడూ ఈటెలను సింహాల కేసి విసిరే లోపల గుర్రాలు బెదిరి, వెనక్కు తిరగబోయి ఒకదాన్నొకటి ఢీ కొట్టుకున్నై. రాజూ, మంత్రీ పట్టు తప్పి వాటి మీది నుంచి కిందికి పడిపోయారు. సింహాలు నోళ్ళు తెరిచి వాళ్ళ మీదికి దూకేంతలో వెనక నుంచి ఖడ్గవర్మా, జీవదత్తుడూ భయంకరంగా అరుస్తూ ముందు కురికి, వాటి వెనకకాళ్ళను పట్టుకుని చేత నున్న ఆయుధాలతో వాటి తలల మీద గట్టిగా కొట్టారు. సింహాలు రెండూ నేల మీద పడి గిలగిల తన్నుకోసాగినై.

పద్మసేనుడూ, మంత్రి అంత సాహసంతో సింహాల నెదుర్కొన్న ఖడ్గ, జీవదత్తుల కేసి ఆనందాశ్చర్యాలతో చూశారు. పరివారం అంతా వాళ్ళ చుట్టూ మూగారు.

పద్మసేనమహారాజు యువకు లిద్దర్నీ ఉద్దేశించి, "మీ ధైర్యసాహసాలే కాక, సింహాలను చంపటంలో మీరు కనబరిచిన నైపుణ్యం కూడా నన్నెంతగానో ఆనందపరుస్తున్నది. నా రాజ్యంలో యింత గొప్ప వీరు లున్నారన్న సంగతి, ఈ నాటివరకూ నాకు తెలియదు," అన్నాడు.

మంత్రి సోమదేవుడు రాజుతో సంప్రతించి, ఖడ్గ, జీవదత్తుల పేర్లు అడిగి తెలుసుకుని, వాళ్ళను నగరానికి ఆహ్వానించాడు. ఒక గంట కాలం అందరూ చెట్లనీడల్లో విశ్రాంతి తీసుకుని, భోజనాలు ముగించిన తరవాత, తిరిగి నగరానికి బయలుదేరారు.

నగరద్వారం దాటి రాజు తన పరివారంతో తన భవనాన్ని సమీపించేంతలో, రాజవీధిలో నుంచి జనం పక్కనున్న సందుగొందులకు పారిపోతూండటం అతడి దృష్టిని ఆకర్షించింది. ఏదో శత్రుసైన్యం నగరంలోకి జొరబడిందేమో అని కూడా ఓ క్షణంసేపు అనుమానించాడు, రాజు. కాని అంతలో కొందరు యువకులు పరిగెత్తుకు వస్తూ, "దారి తొలగండి! పట్టపుటేనుగు కట్లు తెంచుకుని వీధిన పడింది. మావటీని చంపి, అడ్డపడిన వారినందరినీ తొక్కుతూ, తొండంతో విసిరికొడుతూ యిటే వస్తున్నది," అంటూ అరిచారు.

ఆ హెచ్చరిక వింటూనే ఖడ్గ, జీవదత్తులు రాజపరివారం నుంచి ముందుకు వచ్చారు. ఏనుగు ఎటు నుంచి వస్తున్నదా అని వాళ్ళు పరికించి చూసేంతలో, ఐరావతంలా వున్న పట్టపుటేనుగు కోరల నుంచి కారుతున్న రక్తంతో, తొండాన్ని అటూ యిటూ వేగంగా తిప్పుతూ, పెద్దగా ఘీంక



రిస్తూ వారి కేసి పరిగెత్తుకు రాసాగింది. రాజూ, అతడి పరివారం వీధి అంచుకు పోయి కత్తులూ, బాణాలతో దాన్ని ఎదుర్కొనేందుకు సిద్ధం కాసాగారు.

ఖడ్గవర్మ జీవదత్తుణ్ణి హెచ్చరించి కత్తి దూసి, వేగంగా తనను సమీపిస్తున్న మదపు టేనుగు కేసి మెరుపులా దూకి, దాని కాళ్ళ సందుగా పోయి, చటుక్కున దాని తోక పట్టుకుని కత్తితో వెనకకాళ్ళలో ఒకదాని మీద బలంగా కొట్టాడు. అదే సమయంలో జీవదత్తుడు ఏనుగు తొండం పట్టుకుని, ఒక్క ఊపున దాని కుంభస్థలం మీదికి ఎగిరిపోయి, దండంతో దాని తల మీద గట్టిగా మోదాడు.

ఏనుగు భయంకరంగా ఒక్కసారి ఘీంకరించి ఖడ్గవర్మను తొండంతో పడిసి పట్టుకునేందుకు వెనుదిరగబోయింది. కాని అంతలో అతడు దాని రెండవ కాలును కూడా కత్తితో నరికాడు. అదే సమయంలో జీవదత్తుడు దాని తల మీద మరోసారి బలంగా దండంతో కొట్టాడు. ఏనుగు వెనక కాళ్ళు తెగటంతో వెనక్కు విరుచుకు పడబోయి, తల మీద బరువుగా తగిలిన దెబ్బకు ముందుకు ఒరిగి—చివరకు పట్టు తప్పి పక్కకు పడిపోయింది.

మరుక్షణాన రాజప్రాసాదం మీది నుంచి హర్షధ్వానాలు వినిపించినై. ఖడ్గ, జీవదత్తులు తలలెత్తి చూశారు. రాజకుమారి పద్మావతి తన చెలికత్తెలతో కలిసి వాళ్ళిద్దరి మీదా పూలుజల్లింది. ఆ దృశ్యం చూసిన పద్మసేనమహారాజు సంతోషంతో, "కుమారికి యిన్నాళ్ళకు తనకు నచ్చిన మహావీరుడు కనిపించాడు!" అన్నాడు.

"మహారాజా, వీరు ఒకడుకాదు, యిద్దరు! యువరాణికి యీ ఇద్దరిలో ఎవరు నచ్చినట్టు? మీరు ఏకాంతంగా మాట్లాడి చూడండి," అన్నాడు మంత్రి సోమదేవుడు.

—(ఇంకావుంది)





# జన్మసాఫల్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మ[illegible]ం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, ఏదో కోరి ఇంత శ్రమిస్తున్నావు గదా, తీరా నీ కోరిక తీరాక నువు నిజంగా తృప్తిపడతావని నమ్మకం ఏమీ లేదే! పూర్వం కురంగుడికి పట్టిన గతే నీకూ పట్టవచ్చు. శ్రమతెలియకుండా ఉండగలందులకు నీకు అతడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు.

పూర్వం హేమంతదేశాన్ని పాలించిన జయశీలుడు, అరణ్యంలో వేటాడటంలో కన్న కూడా, అరణ్యంలోని మృగాలను ప్రాణాలతో పట్టి తీసుకురావటంలో చాలా నేర్పు కలవాడు.

అయన ఒకనాడు అడవి నుంచి ఒక జింకను పట్టి తెచ్చాడు. రాజుకు సంతానం

## బేతాళ కథలు




లేదు. ఆయనకు ఎందుచేతనో ఈ జింక మీద అమితమైన వాత్సల్యం ఏర్పడింది. దానికి కురంగం అని పేరు పెట్టి, తన సొంత బిడ్డను చూసినట్టు చూసుకోసాగాడు. రాజభవనంలో అందరూ కురంగాన్ని రాజకుమారుణ్ణి చూసినట్టే చూసేవారు.

అయితే కురంగానికి అరణ్యంలో ఉండిన స్వేచ్ఛ ఇప్పుడు లేదు. అది దానికి బాధగానే వుండేది. అయినా అది మానవులకు గల మహత్తర శక్తులను అర్థం చేసుకున్నది. వాళ్ళు తమ కన్న ఎంతో బలం గల సింహాలనూ, పులులనూ, ఏనుగులనూ పట్టి తెచ్చి బోనులలో బంధించారు. అరణ్యంలో తన ప్రాణాలను క్షణంలో తీయగల క్రూర మృగాలు మానవులకు చిక్కి, వారి అదుపు ఆజ్ఞలలోనూ, శిక్షణలోనూ ఉంటున్నాయి.

"నిజంగా జన్మ అంటే మానవులదే జన్మ!" అని కురంగం మెచ్చుకున్నది.

కాని దానికి స్వేచ్ఛ పైన ఇచ్ఛపోలేదు. అది రోజురోజుకూ ఎక్కువ కాసాగింది. అరణ్యంలో తాను స్వేచ్ఛగా గడిపిన జీవితం దానికి కలలు రాసాగింది. మనుషుల నిర్బంధం నుంచి ఎలా తప్పించుకు పారిపోవటమా అని చూసి చూసి, అవకాశం దొరకగానే కురంగం రాజభవనం నుంచి తప్పించుకుని అరణ్యంలోకి పారిపోయింది.

అరణ్యంలోకి ప్రవేశించిన కురంగం తిన్నగా ఒక ముని ఆశ్రమంలోకి వెళ్ళింది. దానికి ఆ మునిని చూడగానే పరమానందమయింది. ముని కూడా ఉత్తమమైన మానవజన్మ ఎత్తినవాడే. అయితే ఆయన తనను నిర్బంధంలో ఉంచడు. ఈ ముని వెంట ఉండటంవల్ల తనకు స్వేచ్ఛా, మానవస్నేహమూ, రెండూ లభిస్తా యనుకున్నది కురంగం.

కురంగానికి మానవజాతి పట్ల చాలా గౌరవం ఉన్నదని ముని గ్రహించాడు. తన తపశ్శక్తితో దానికి మానవరూపం ఇస్తే ఏం

చేస్తుందో చూడాలన్న అభిలాష కలిగి, ఆ ముని కమండలోదకం చల్లి కురంగాన్ని మనిషిగా మార్చాడు. ముని ఎదట కురంగుడు ఒక యువకుడుగా నిలబడ్డాడు.

కురంగుడు తనకు మానవజన్మ లభించినందుకు ఎంతగానో సంతోషించాడు. వాడు మునికి సేవలు చేస్తూ కొద్ది రోజులు ఆ ఆశ్రమంలోనే గడిపాడు. కాని వాడి మనస్సంతా ఇప్పుడు నగరం మీద ఉన్నది. ఈ అరణ్యమూ, ఆశ్రమమూ వాడికి ఏమాత్రమూ బాగాలేదు. ముని తన దారిన తాను తపస్సులో మునిగి ఉంటాడు. తపస్సు చేసుకోనప్పుడు కూడా ఏమీ మాట్లాడడు. జనసంచారం లేదు. వింతలూ, వినోదాలూ అసలే లేవు.

ఒకనాడు కురంగుడు మునికి చెప్పకుండా నగరానికి పారిపోయాడు. నగరంలో అంతమంది జనం ఉండి కూడా కురంగుణ్ణి గురించి ఎవరూ పట్టించుకోలేదు. కొందరు వాణ్ణి పలకరించి, "నీ పేరేమిటి? ఊరేమిటి? ఏం పని చేస్తావు?" అని అడిగితే వాడు ఏమీ చెప్పలేకపోయాడు.

"నేను పులులనూ, సింహాలనూ పట్టుకుని బోనుల్లో పెడతాను," అని వాడు కొందరితో తన కోరిక తెలిపాడు. ఆ పని ఎలా చేస్తాడో వాడికీ తెలియలేదు.





ఎక్కడికి వెళ్ళాలో తెలీక వాడు రాజ భవనంలో ప్రవేశించ బోయాడు. కాని ద్వారపాలకులు వాణ్ణి అడ్డగించారు.

"నేను ముందు ఇక్కడ ఉన్నవాణ్ణే!" అని వాడు చెబితే వాళ్ళు విరగబడి నవ్వారు.

జింక రూపంలో ఉండగా తనపట్ల ఎంతో శ్రద్ధ చూపినవాళ్ళు మనిషి అయినాక తనను హీనంగా చూడటం అతడికి అర్థం కాలేదు.

రాజభవనం ఆవరణలో అడుగు పెట్టలేక కురంగుడు మనిషి సాంగత్యం కోసం వీధి వెంట నడిచేవాళ్ళ వెంట పడ్డాడు. వాళ్ళు అది గమనించి వాణ్ణి తరిమి కొట్టారు. కొందరు వాడికి పిచ్చి పట్టిందనుకున్నారు.

కురంగుడికి ఏమి చెయ్యటానికీ పాలు పోలేదు. తిరిగి తిరిగి వాడు అలసిపోయాడు. ఆకలి దహించుకు పోతున్నది. ఏ చెట్టు ఆకులో, దారి పక్క గడ్డో మెయ్యటానికి జింక కాదు, మనిషి.

కొందరు యాచకులు ఇంటింటా తిండి అడుక్కుంటూ ఉండటం కురంగుడు చూసి, తాను కూడా అదే పని చేశాడు. కొందరు వాణ్ణి చూసి, "రాయిలాగా ఉన్నావు. ఏదన్నా పని చేసి పొట్ట పోసుకోలేవా?" అని తిట్టారు. ఎవరో ఇల్లాలు వాడికి పాచిపోయిన ఆహారం పెట్టింది. అది తినగానే కురంగుడికి వాంతి అయింది. రాజుగారి ఇంట తాను జింక రూపంలో ఉన్నప్పుడు వంటకాలు ఎంత మంచి వాసన కొట్టేవో వాడికి గుర్తున్నది.

ఒక ఇంటి నుంచి కాస్త మంచి ఆహారం వాసన కొట్టింది. వాడా వాసనను బట్టి లోపలికి వెళ్ళి, వంట ఇంట్లో తయారుగా ఉన్న వంటకాలను చూశాడు. అక్కడ ఎవరూ లేరు. వాడు ఒక పాత్ర తీసుకుని అవురావురుమని తినసాగాడు. ఇంతలో ఎవరో వచ్చి, "దొంగ, దొంగ!" అని కేకలు పెట్టి, కురంగుణ్ణి పట్టుకుని, చావగొట్టి, కారా గృహంలో పెట్టించారు.

కురంగుడి కిప్పుడు మానవజన్మ మీద పూర్తిగా విరక్తి కలిగింది. కాపలావాళ్ళు అజాగ్రత్తగా ఉన్న సమయంలో వాడు కారాగృహం నుంచి తప్పించుకుపోయి, అరణ్యం చేరుకుని, ఆశ్రమంలో ఉన్న ముని కాళ్ళ పైన పడి, "స్వామీ, నాకీ మానవజన్మ వద్దు. నన్ను తిరిగి జింకగా మార్చండి," అని ఏడ్చాడు. ముని కమండలోదకం చల్లి కురంగుణ్ణి తిరిగి జింకగా మార్చేసి, దాన్ని తన ఆశ్రమంలోనే ఉండనిచ్చాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, మానవజన్మ గురించి కురంగుడి అభిప్రాయం మారిపోవటానికి మూలకారణ మేమిటి? ఒకసారి మనిషి అయినవాడు తిరిగి జింక కావటానికి సిద్ధపడ్డాడంటే, మనిషి జన్మ నిజంగా ఉత్తమజన్మ కాదనుకోవాలా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కురంగుడు మానవజన్మ గురించి అభిప్రాయం మార్చుకోవటానికి రెండు భిన్నకారణా లున్నాయి. సుఖమే జీవిత పరమార్ధ మనుకున్నట్టయితే, హీనప్రాణులు సుఖపడినంతగా మానవులలో చాలామంది సుఖపడరు. వారికి కలిగే కష్టాలు సంస్కారంతో ఎదుర్కోవలసినవి. అలాటి మానవ సంస్కారం కురంగుడికి లేదు. మరొక కారణం ఏమిటంటే, కురంగుడు తన కర్మ పరిపాకం ద్వారా మానవజన్మ ఎత్తినవాడు కాడు. ముని యొక్క తపశ్శక్తి కారణంగా అతనికి మానవరూపం లభించింది. అందుచేత మానవ జీవితం అతనికి ఏ మాత్రమూ అతకదు. అందుకే అతను జింకగా మారటానికి తహతహలాడాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)







# అయిదు తలల నాగేంద్రుడు

ఒక గ్రామంలో కిశోరు డనే కుర్రవా డుండేవాడు. వాడికి ఎవరూ లేరు. అందు చేత వాడు ఉన్న చోట ఉండకుండా దేశాలుపట్టి తిరుగుతూ ఉండేవాడు. వాడికి కొత్త చోట్లన్నా, కొత్త కొండలన్నా, కొత్త నదులన్నా, కొత్త మనుషులన్నా ఎంతో ఇష్టం. ఎవరు పలకరించినా వాళ్ళతో కిశోరుడు ఆప్యాయంగా మాట్లాడేవాడు.

ఒకరోజు వాడు ఒక వృద్ధుడితో మాట్లా డుతూ, "తాతా, నేను చూడని దేశం లేదు. ప్రపంచమంతా చూశాననుకో. ఇంకా చూస్తాను," అన్నాడు.

దానికా వృద్ధుడు, "బాబూ, ఈ ప్రపం చాన్ని ఎవరైనా చూడవచ్చు. దీనికి దిగు వన ఇంకా ఏడు ప్రపంచా లున్నాయి. అవి చూసినవాడు గొప్పవాడు!" అన్నాడు.

ఆ క్షణం నుంచీ వాడికి భూమి అడు గున ఉన్న ప్రపంచాలు చూడాలనిపిం చింది. కిందిలోకాలకు పోవాలంటే ఎక్కడో బిలా లున్నాయని వాడు ఎవరో చెప్పగా విన్నాడు. అందుచేత వాడు దేశసంచారం చేస్తూ, ఎక్కడ ఏ బిలం ఉందని తెలిసినా అందులోకి దిగి చూశాడు. కాని అన్ని బిలాలూ కొంత లోతున ఆగిపోయాయి.

ఇలా ఉండగా ఒకరోజు కొన్ని కొండల మధ్య వాడి కొక గుహ కనబడింది. ఆ గుహలో ఏమున్నదని కిశోరుడు అక్కడ పశువులు కాస్తున్నవాళ్ళని అడిగాడు.

"అది పాతాళగుహ," అన్నారు వాళ్ళు.

"అందులోకిపోతే పాతాళం వస్తుందా?" అని అడిగాడు కిశోరుడు.

"ఏమో, ఎవరుచూశారు? అందులోకి ఎవరూపోరు," అన్నారు పశువులకాపర్లు.

కిశోరుడు ఆ గుహలోకి ప్రవేశించాడు. కొంత దూరం పోయాక గుహలో నుంచి కిందికి దిగి పోయే బిలం కనిపించింది.

జి. ఆదిశేషయ్య



కిశోరుడు చీకటిలో తడువుకుంటూ ఆ బిలం వెంట దిగిపోయాడు. పోయినకొద్దీ వేడి జాస్తి అయింది. అయినా లక్ష్యపెట్టక కిశోరుడు ఇంకా కిందికి దిగిపోయాడు. కొంతసేపటికి దిగువన కాంతి కనబడింది. అది మంటల కాంతి. ఆ మంటలున్న లోకంలోకి కిశోరుడు అడుగు పెట్టాడు.

అక్కడ అతని కొక వింతమనిషి కనబడి, ''ఎవరు నువు? భూలోకంలో వాడివి లాగున్నావు. ఈ లోకాని కెందుకు వచ్చావు?" అని అడిగాడు.

''నాకు కిందిలోకాలన్నీ చూడా లనిపించింది. వచ్చాను,'' అన్నాడు కిశోరుడు.

"రావటం వచ్చావు గాని, తిరిగి ఎలా వెళతావు? అది సాధ్యం కాదు,'' అన్నాడు వింతమనిషి.

"ఆ విషయం నాకు విచారం లేదు. నాకు ఏ లోకమైనా ఒకటే. దిగువ లోకాలన్నీ చూడటం ఎలాగో తమకు తెలిస్తే చెప్పండి,'' అన్నాడు కిశోరుడు.

వింతమనిషి తన కాలిచెప్పులు కిశోరుడికిస్తూ, "ఇవి తొడుక్కుంటే నీకు అధోలోకాలకు వెళ్ళే శక్తి వస్తుంది. కాని నువు పైకి రావటానికి ఇవేమీ ఉపకరించవు,'' అని చెప్పాడు.




కిశోరుడు సంతోషంగా ఆ చెప్పులు తొడుక్కున్నాడు. వెంటనే అతనికి వేడివల్ల బాధ లేకుండా పోయింది. అతను ఆ లోకమంతా చూశాడు. చాలామటుకు అది కూడా భూలోకం లాగే ఉంది.

అక్కడి నుంచి కిశోరుడు కింది లోకానికి దారి అడిగి తెలుసుకుని, ఆ లోకానికి దిగిపోయాడు. అక్కడ మనుషులు ఇంకా తక్కువగా ఉన్నారు. ఒక్కొక్క లోకమే చూసుకుంటూ, ఆకలి వేసినప్పుడు ఎవరినన్నా తిండి యాచించి, వారు పెట్టినది తింటూ, చివరకు కిశోరుడు నాగలోకానికి చేరుకున్నాడు.



నాగలోకం మిగిలిన లోకాలన్నిటి కన్నా చాలా అసహ్యంగా ఉన్నది. మనిషి లాటి ప్రాణి అక్కడ మచ్చుకైనా కనిపించ లేదు. ఎక్కడ చూసినా సర్పాలు.

మిగిలిన లోకాలకు వచ్చినందుకు కిశోరుడు పశ్చాత్తాప పడలేదు గాని, నాగలోకానికి వచ్చినందుకు చాలా విచారించాడు. ఈ లోకంలోనే తాను శాశ్వతంగా ఉండి పోవాలంటే అతనికి దిగులు పుట్టుకొచ్చింది.

ఇంతలో అతని వెనక నుంచి, ''ఎవరు నువు?'' అని భయంకరమైన గొంతు ప్రశ్నించింది. కిశోరుడు వెనక్కు తిరిగి ఒక బ్రహ్మాండమైన పక్షిని చూశాడు.

''మహాప్రభో, నే నొక బుద్ధిలేని మనిషిని. అధోలోకాలు చూడాలన్న కుతూహలంతో, అజ్ఞానం కొద్దీ ఇలావచ్చాను. నా తెలితక్కువను మన్నించి తమరు నన్ను నా లోకానికి పంపేస్తే తమకు యావజ్జీవం కృతజ్ఞుడనై వుంటాను,'' అన్నాడు కిశోరుడు ఆ పక్షికి నమస్కారం చేసి.

ఆ పక్షి కొంచెం ఆలోచించి, ''పెద్ద పొరపాటే చేశావు. కాని నీ కోరిక సిద్ధించే టట్టు నేను చూస్తాను. నేను ఈ సర్పాలకు చక్రవర్తిని. నన్ను గరుత్మంతు డంటారు. నేను ఒక సర్పాన్ని నీకు తోడిచ్చి మీ లోకానికి పంపుతాను. నువు మీ లోకం చేరి ఆ సర్పాన్ని తిప్పి పంపెయ్యి. సర్పాలు మహా తలబిరుసుగా వుంటాయి. నా ఈక ఒకటి తీసి దగ్గిర ఉంచుకో. అది ఒంటికి తగిలితే చాలు ఏ సర్పమైనా చెప్పిన మాట వింటుంది,'' అన్నాడు.

గరుత్మంతుడు ఒక మహా సర్పాన్ని పిలిచి, "నువు ఈ మనిషి వెంట వెళ్ళి ఇతన్ని భూలోకం చేర్చు. అతను చెప్పినట్టు చెయ్యి. ఇది నా ఆజ్ఞ,'' అన్నాడు.

మహాసర్పం వెంటరాగా కిశోరుడు అధోలోకాలన్నీ దాటి భూలోకానికి చేరుకున్నాడు. ఈ ప్రయాణం చాలా రోజులు పట్టింది.

అందుచేత సర్పం తనకు కావలిసిన ఆహారాన్ని నాగలోకం నుంచి తెచ్చుకున్నది. దారిలో అది పేచీలు పెట్టినప్పుడల్లా కిశోరుడు గరుత్మంతుడి ఈక తీసి చూపి భయపెట్టాడు.

"నాకు చాలా సహాయం చేశావు. ఇక నువు నీ లోకానికి తిరిగివెళ్ళు. నిన్నూ, నీ అవతారాన్నీ చూసి ఈ లోకంలోవాళ్ళు దడుచుకుంటారు," అన్నాడు కిశోరుడు సర్పంతో.

"నాకు దారిబత్తెం ఇప్పించు, అలాగే పోతాను. ఇంటి నుంచి తెచ్చుకున్న తిండి అయిపోయింది," అన్నది సర్పం.

"ఎంత ఆహారం కావాలి?" అన్నాడు కిశోరుడు.

"అయిదు దున్నలు," అన్నది సర్పం.

"దొరుకుతాయేమో చూస్తాను. నువు ఈ పక్కనే ఉన్న కొండగుహలో ఉండు," అన్నాడు కిశోరుడు.

కిశోరుడు ఆహారం తెస్తానని సర్పానికి మాట ఇచ్చాడేగాని, అయిదు దున్నలను తీసుకురాగల నన్న నమ్మకం అతనికి ఏ కోశానా లేదు. ఎవరి దగ్గరనైనా దున్నలను కొందామన్నా అతని వద్ద చిల్లిగవ్వ కూడా లేదు.



కిశోరుడు కొంత దూరం ప్రయాణించి ఒక గ్రామం చేరాడు. అతను గ్రామపెద్ద ఇంటికి వెళ్ళి, తాను నాగలోకానికి వెళ్ళి వస్తున్నట్టు చెప్పాడు. త్వరలోనే ఈ వార్త గ్రామమంతా తెలిసింది. గ్రామప్రజలు కిశోరుడి చుట్టూ మూగి, అతని అనుభవాలు ఆశ్చర్యంగా విన్నారు.

క్రమంగా వార్త చుట్టుపట్ల గ్రామాలకు తెలిసింది. అందరూ కిశోరుడి అనుభవాలు చెప్పించుకు వినేవాళ్ళే, అతనికి వీరపూజ జరిగింది. ఈ సందడిలో కిశోరుడు సర్పం మాటా, దాని ఆహారం మాటా పూర్తిగా మరిచాడు. అందుకు కారణం ఏమంటే,





ఇంతలో మరింత దారుణం జరిగింది. ఇద్దరు మగపిల్లలూ, ముగ్గురు ఆడపిల్లలూ మాయమయారు. ఇది సర్పం పనే. దాన్ని చంపటానికి గ్రామాలలో ఉన్న సాహసికులైన యువకులు బయలుదేరుతున్నారు. కిశోరుడు వాళ్ళను కలుసుకుని, "నేనూ మీ వెంట వస్తాను," అన్నాడు.

"అలా అయితే ఏదన్నా ఆయుధం తీసుకో," అన్నారు యువకులు. వాళ్ళు గొడ్డళ్ళూ, ఈటెలూ, కత్తులూ, బరిసెలూ తీసుకున్నారు.

"నా కేమీ ఆయుధం అవసరంలేదు," అంటూ కిశోరుడు వారి వెంట వెళ్ళాడు.

అతను తన వెంట వచ్చిన పాము మాట గాని, దానికి తాను ఆహారం తెస్తానన్న మాట గాని ఎవరికీ చెప్పలేదు.

కిశోరుడి వీరపూజ ఆకస్మాత్తుగా ఆగిపోయింది. గ్రామాలలో గొర్రెలూ, ఆవులూ, దూడలూ మాయం అవుతున్నాయి. ఒక భయంకరమైన సర్పాన్ని నలుగురైదుగురు గ్రామస్థులు చూశారు. అదే జంతువులను కాజేస్తూ ఉండాలి.

ఈ వార్త వినగానే కిశోరుడు చాలా బాధపడ్డాడు. గ్రామాలకు ఈ అరిష్టం తన మూలంగానే వచ్చిందని అతనికి తెలుసు. కాని ఆ మాట పైకి చెప్పలేకపోయాడు.

అంతా కలిసి కొండగుహను చేరుకున్నారు. వాళ్ళ అలికిడి విని సర్పం గుహ నుంచి బయటికి వచ్చింది. దాన్ని చూస్తూనే కిశోరుడి వెంట వచ్చినవాళ్ళు వెనక్కు తిరిగి పారిపోయి, దూరంగా నిలబడ్డారు.

కిశోరుడు మాత్రం సర్పాన్ని సమీపించి, "ఏమిటి నీ ఆగడం? నువ్వెందు కింకా వెళ్ళిపోలేదు?" అని కోపంగా అడిగాడు.

"నువు నాకు ఆహారం తెచ్చి పెడతానంటివి గద? నీ కోసమే చూస్తున్నాను," అన్నది సర్పం.





"నేను ఆహారం తెచ్చేదాకా ఊరుకున్నావా? దొరికిన మృగమల్లా తిన్నావు గద? మృగాలను తింటే తిన్నావు. పిల్లలను తింటావా? ఎంత అన్యాయం!" అన్నాడు కిశోరుడు.

"నేను పిల్లలను తిన్నానా? ఎవరా అన్నది? లోపలికివచ్చి చూడు!" అంటూ సర్పం గుహ లోపలికి దారి తీసింది.

గుహ లోపలిభాగం విశాలంగా ఉన్నది. దాని ఎగువ ఆకాశం కూడా కొద్దిమేర కనిపిస్తున్నది. అక్కడ అయిదుగురు పిల్లలు మహా ఉత్సాహంగా ఆటలాడుకుంటున్నారు.



కిశోరుడు వాళ్ళను సమీపించి, "మీ అమ్మలూ, నాన్నలూ మీ కోసం శోకాలు పెడుతుంటే మీ రిక్కడ ఆటలాడుతున్నారా? పదండి మీ ఇళ్ళకు," అన్నాడు.

"మేం పోము! మా కిక్కడ బాగున్నది. పాము మీద సవారీ చేస్తున్నాం. తోక పట్టుకుని ఉయ్యాల లూగుతున్నాం," అన్నాడొక పిల్లవాడు.

"నాకు తోడుగా ఉన్నారు. వాళ్ళను తీసుకుపోకు," అంటూ సర్పం ప్రాథేయపడింది.

"నీ సుఖం కోసం వాళ్ళ తల్లిదండ్రులను ఏడవమంటావా? అదేమీ కుదరదు. ఈ పిల్లలను నా వెంట పంపావంటే నీ అయిదు దున్నలనూ సాయంకాలం లోపల తెచ్చి ఇస్తాను, సరేనా?" అన్నాడు కిశోరుడు సర్పంతో.

"నీ యిష్టం. అలాగే కానీ!" అన్నది సర్పం విచారంగా.

కిశోరుడు అయిదుగురు పిల్లలనూ వెంటబెట్టుకుని గుహ బయటికి వచ్చేసరికి, బయట దూరంగా ఉన్న యువకుల ఆశ్చర్యానికి అంతులేదు. తరవాత తమ పిల్లలు సుఖంగా తిరిగివచ్చినందుకు వాళ్ళ తల్లిదండ్రులు కిశోరుడికి బ్రహ్మరథం పట్టారు.





"నేను మీకీ ఉపకారం చేసినందుకు నాకు అయిదు దున్నపోతులను వెంటనే ఇప్పించండి," అని కిశోరుడు వాళ్ళను అడిగాడు.

"అయిదు కాదు, ఆయిదువంద లివ్వ మంటే ఇస్తాం. మా పిల్లలను ప్రాణాపాయం నుంచి రక్షించావు," అన్నారు వాళ్ళు.

కిశోరుడు అయిదు దున్నపోతులనూ తీసుకుని సర్పం ఉండే గుహకు వెళ్ళి, "ఈ దున్నపోతులను తీసుకుని నువు నీ లోకానికి వెళ్ళిపో, నేను కాస్త పరువుగా బతుకుతాను!" అన్నాడు సర్పంతో.

"కిశోర్, నన్ను పంపెయ్యకు. నాకీ లోకం బాగున్నది. నీ దున్నపోతులు నాకు వద్దు, నువే ఉంచుకో. నేనీ ప్రాంతంలో ఉండకుండా ఎటో వెళ్ళిపోతాను. నా వల్ల నీకేమీ అపకీర్తి రాదు, నిశ్చింతగా ఉండు," అన్నది సర్పం దీనంగా.

కిశోరుడికి దాన్ని చూస్తే జాలివేసింది; పైకి మాత్రం గంభీరంగా, "రేపటి నుంచీ నువ్వీప్రాంతాల కనిపిస్తే నేను ఊరుకునేది లేదు," అని హెచ్చరించి, గ్రామాలకు తిరిగి వచ్చాడు.

అటుతరవాత ఆ ప్రాంతాల సర్ప భయం పోయింది. అనేక గ్రామాలవాళ్ళు ఏకమై కిశోరుణ్ణి కిరీటంలేని రాజును చేసేశారు.

ఒక ఏడాది కాబోలు గడిచింది. నూరు యోజనాల దూరంలో ఉండే ఒక రాజ కుమార్తెనూ, ఆమె చెలికత్తెలనూ ఒక భయంకరమైన సర్పం ఎత్తుకుపోయినట్టు వార్త పొక్కింది. తన కుమార్తెను సర్పం బారి నుంచి కాపాడిన వారికి ఆ కుమార్తె నిచ్చి పెళ్ళి చేస్తానని రాజు చాటింపు వేయించాడు.

రాజకుమార్తె విషయం పట్టలేదుగాని, తన మూలంగానే భూలోకవాసులకు పెద్ద

బెడదవచ్చిపడ్డందుకు కిశోరుడు విచారించాడు. ఈసారి తప్పక ఆ సర్పాన్ని నాగలోకానికి పంపెయ్యాలని నిశ్చయించుకుని, అతను నూరు యోజనాలూ ప్రయాణించి రాజుండే చోటు చేరుకున్నాడు.

రాజకుమార్తె అందలంలో చెలికత్తెలతో సహా వనవిహారానికి పోతుంటే, అకస్మాత్తుగా మహాసర్పం దారి కడ్డువచ్చి, రాజకుమార్తెనూ, బోయీలనూ, అందలాన్నీ, చెలికత్తెలనూ కూడా తీసుకుపోయి నగరం వెలుపల ఉన్న కొండగుహకు చేర్చిందని కిశోరుడు తెలుసుకున్నాడు. రాజు సర్పాన్ని చంపటానికి సైనికులను పంపితే వారు, అది ఊదిన మంటలకు తట్టుకోలేక పారిపోయివచ్చారట.

సర్పం ఉండే చోటికి దారి తెలుసుకుని కిశోరుడు ఒంటరిగా బయలుదేరి వెళ్ళాడు. అతని అలికిడి విని సర్పం గుహ నుంచి భయంకరంగా మంటలు కక్కుతూ అతని మీదికి వచ్చింది.

కిశోరుడు గరుత్మంతుడి ఈక పైకి తీసి, "నా మీద ఎదురుతిరిగేదాకా వచ్చిందా నీ సంగతి?" అన్నాడు.

"రాజకుమారుడల్లే తయారయావు. అందుచేత నిన్ను గుర్తించలేదు, కిశోర్.



నా కోసం ఇంతదూరం వస్తావనీ అనుకోలేదు." అన్నది సర్పం.

"ఇంతకూ ఆ రాజకుమార్తెనూ, మిగిలిన వాళ్ళనూ ఏం చేశావు?" అన్నాడు కిశోరుడు కోపంగా.

"ఏమీ చెయ్యలేదు, కిశోర్. ఒంటరిగా ఉండలేక తోడు తెచ్చుకున్నాను. చూడు. కిశోర్. రాజకుమార్తె రవ్వలాటి పిల్ల. నువు తీసుకుపోయి పెళ్ళాడు. నువు నన్ను పంపెయ్యనందుకు నేను చేసే ప్రత్యుపకారం ఇదే!" అన్నది సర్పం.

"అయితే నువు నాగలోకానికి తిరిగి పోవా?" అన్నాడు కిశోరుడు.

"అక్కడ బాగుండదు, కిశోర్. ఈ లోకం చాలా బాగుంది. నన్ను పంపేస్తే నీకేం ఒరుగుతుంది?" అన్నది సర్పం.

"నువ్వు ఇలాటి పాడుపనులేవో చేస్తావు. వాటికి బాధ్యుణ్ణి నేనే కద!" అన్నాడు. కిశోరుడు.

"చూడు, కిశోర్. నేను ఒంటరిగా ఉండలేను. ఒక పని చెయ్యి. గరుత్మంతుడి ఈకతో నా తలకు రెండు పక్కలా గీరు. మరి రెండు తలకాయలు మొలుస్తాయి. వాటిని గీరావంటే మరిరెండు తలలు మొలుస్తాయి. అప్పుడు నాతో నేను రకరకాల కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేస్తాను," అన్నది సర్పం.

"ముందు రాజకుమార్తెనూ, పరివారాన్నీ వదులు," అన్నాడు, కిశోరుడు.

రాజకుమార్తె గాని, ఆమె వెంట ఉన్న వాళ్ళు గాని సర్పాన్ని చూసి భయపడుతున్నట్టు కనిపించలేదు. రాజకుమార్తె పాముతో వెళ్ళివస్తానని చెప్పి అందలంలో తన ఇంటికి బయలుదేరింది.

కిశోరుడు సర్పంతలను గరుత్మంతుడి ఈకతో గీరి దానికి అయిదు తలలు తెప్పించాడు. "నే నిక మనుషుల జోలికి రాను, కిశోర్. నా వల్ల నీకు ఎలాటి అపకీర్తి రాదు. నా మాట నమ్ము," అన్నది సర్పం.

కిశోరుడు తిన్నగా రాజభవనానికి వెళ్ళి, రాజుగారి గౌరవం పొంది, రాజకుమార్తెను పెళ్ళాడాడు.

సర్పం గురించి మరెక్కడా ఆందోళన పుట్టలేదు. అయితే అప్పుడప్పుడూ ఎవరో ఒకరు, "అయిదుతలల నాగేంద్రుడు కనిపించాడు!" అని అనటం జరిగింది. చాలా మంది దాన్ని దేవుడుగా స్మరించి పూజించారు. అయిదుతలలు ఆ నోటా ఆ నోటా పది పన్నెండు తలలూ, వెయ్యి తలలూ కూడా అయాయి. నాగేంద్రుణ్ణి గురించి ఎన్నో కథలు కూడా పుట్టాయి.





# రాజ్యార్హుడు

పూర్వం రత్నగిరి రాజుకు లేకలేక కవల పిల్లలు కలిగారు. రాజు వారికి అజయ సింహుడూ, విజయసింహుడూ అని పేర్లు పెట్టి ఎంతో గారాబంగా పెంచాడు.

రాజు తన కొడుకులకు తగిన గురువులను ఏర్పాటు చేసి, రాచవిద్యలన్నీ శ్రద్ధగా నేర్పించాడు. అన్ని విద్యలలోనూ ఇద్దరూ సమమైన ప్రావీణ్యం ప్రదర్శించారు.

వాళ్ళకు యుక్తవయసు వస్తున్న కొద్దీ రాజుకు ఒక సమస్య పట్టుకున్నది. తన అనంతరం వారిలో ఎవరు రాజు కావాలి?

ఆయన గురువులను అడిగి చూశాడు.

"మహారాజా, అజయ విజయులలో మాకు ఏమాత్రమూ తేడా కనిపించ లేదు. ఇద్దరూ అన్ని విద్యలలోనూ తూచినట్టు సమంగా ఉన్నారు," అన్నారు గురువులు.

ఈ మాట విని రాజు నిరాశ చెంది, మంత్రితో తన సమస్య గురించి చెప్పాడు.

"మహారాజా, అజయ విజయుల పట్ల మీకు సమమైన ప్రేమ ఉండటం చేతనే మీకీ సమస్య ఏర్పడింది. కనుక ఇప్పుడు మనం తెనుకోవలిసిన దేమంటే, అజయ విజయులలో ఎవరికి మీ పైన ఒక్క పిసరు హెచ్చు ప్రేమ ఉన్నదని! ఎవరికి మీ పైన ప్రేమ హెచ్చుగా ఉంటే వారినే యువ రాజుగా చెయ్యండి," అన్నాడు మంత్రి.

"నా కొడుకు లిద్దరూ నన్ను సమంగానే ప్రేమిస్తున్నారనుకుంటున్నాను. వారి ప్రేమలో, ఒకవేళ, కాస్త హెచ్చు తగ్గు లుంటే అది మనం తెలుసుకునే దెలా?" అని రాజు అడిగాడు. అందుకు మంత్రి ఒక ఉపాయం ఆలోచించి చెప్పాడు.

ఒకనాడు రాజు వేటకని బయలుదేరుతూ అజయ, విజయుల నిద్దరినీ తన వెంట తీసుకుపోయాడు. మంత్రి కూడా వారి వెంట బయలుదేరాడు.

---

వై. రాజేంద్రనాథ్

---

దారిలో ఒక పౌరుడు పరిగెత్తుకుంటూ వచ్చి, "మహారాజా, మా బంగారుపల్లె మీద బందిపోటు దొంగలు పడి దోస్తున్నారు. తమరు వచ్చి మమ్మల్ని కాపాడాలి," అని వేడుకున్నాడు.

రాజు తన కొడుకుల కేసి చూశాడు. అజయ, విజయులు తండ్రి భావం గ్రహించి, ఆ పౌరుడితో బంగారుపల్లెకు బయలు దేరారు. వాళ్ళు కొంతదూరం వెళ్ళేసరికి వెనక నుంచి ఒక రాజభటుడు పరిగెత్తు కుంటూ వచ్చి, "మహారాజా వారిని దొంగలు చుట్టు ముట్టారు. మహారాజావారు వాళ్ళతో యుద్ధం చేస్తున్నారు," అని చెప్పాడు.

ఈ మాట వింటూనే విజయుడు, "అజయా, పద! ముందు వెళ్ళి నాన్న గారిని కాపాడదాం," అన్నాడు.

"లేదు, విజయా! నాన్నగారిని మనం వెళ్ళి రక్షించ నవసరం లేదు. ఆయన తనను తాను రక్షించుకోగలరు. తమను తాము రక్షించుకోలేనివారు బంగారుపల్లె ప్రజలు," అన్నాడు అజయుడు.

అయినా విజయుడికి మనస్సు నిలవ లేదు. తండ్రిని దొంగల నుంచి కాపాడా లనిపించింది. అతను తండ్రి ఉన్న చోటికి అతి వేగంగా తిరిగి వచ్చి, రాజూ, మంత్రీ ఒక చోట కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉండటం చూశాడు. అజయుడు కూడా బంగారుపల్లెకు వెళ్ళి అక్కడ బందిపోటు బెడద ఏమీ లేదని తెలుసుకున్నాడు.

"చూశారా, మహారాజా? విజయుడికే మీ పైన హెచ్చు ప్రేమ. అతనినే యువ రాజు చెయ్యండి," అన్నాడు మంత్రి రాజుతో.

"లేదు, మంత్రీ. అజయుడికి నా మీద తక్కువ ప్రేమ లేదు. పైగా హెచ్చు విశ్వాసం ఉన్నది. దానికి తోడు వాడికి ప్రజలపట్ల ఆదరం ఉన్నది. వాడే రాజ్యార్హుడు!" అన్నాడు రాజు.





# మాయదారి ముసలిది

## 5

ఆ రాత్రి చీకటిపడి ఆ ఇంటి యజమాని తన నౌకరుతో సహా తిరిగి వచ్చాడు. తల వాకిలికి తాళం లేదు. కంగారుపడి ఆయన ఇల్లంతా చూసుకుని, దొంగతనం ఏమీ జరగ లేదని తెలుసుకున్నాడు.

తన యజమాని స్నానం కోసం నౌకరు బావి వద్దకు వెళ్ళి, చేద వేసి పైకి తోడ బోయాడు. కాని చేదను ఎవరో గట్టిగా పట్టు కున్నట్టు అయింది.

"అమ్మో, దయ్యం!" అని కేక పెట్టి నౌకరు ఇంట్లోకి పరిగెత్తాడు.

వర్తకుడు దీపం పట్టుకుని దొడ్లోకి వచ్చి, చేదతాడు పట్టుకుని బావిలో నుంచి పైకి వస్తున్న "పాదరసం" అలీని చూశాడు.

వర్తకుడు ఆగ్రహంతో, "బద్మాష్! ఎవరు నువు? ఇప్పుడే నిన్ను భటులకు పట్టి ఇస్తాను!" అని కేకలు పెట్టాడు.

"పాదరసం" అమాయికంగా మొహం పెట్టి, ఎంతో మర్యాదగా, "అయ్యా, ఇది ఏ దేశం? ఏ గ్రామం? నేను ఈజిప్టుదేశం వాణ్ణి. నేను మా నైల్ నదిలో స్నానం చేస్తూ, ఒక సుడిగుండంలో చిక్కుకుని అడుగుకు దిగిపోయి, చాలా సేపటికి తేలాను. నేను తేలినది మీ బావిలో!" అన్నాడు.

ఈ అబద్ధాన్ని వర్తకుడు నమ్మేశాడు.

"ఎంత ఆశ్చర్యం! ఇది బాగ్దాదు నగరం. ఎక్కడ మునిగి ఎక్కడ తేలావు! నీకు పాడిబట్టలిస్తాను. ఈ రాత్రికి ఇక్కడే భోజనం చేసి పడుకో. రేపు మీ దేశానికి బయలుదేరి పోదువుగాని," అన్నాడు ఆయన జాలిగా.

మర్నాడు ఉదయం "పాదరసం" తిరిగి ఇంటికి చేరేదాకా అహ్మద్ ప్రాణాలు ప్రాణా లలో లేవు. తన ప్రయత్నాల్ని సుంచిన

అర్. నాగభూషణం



"పెళ్ళాడదామనుకుంటున్నాను!" అన్నాడు "పాదరసం" తడుముకోకుండా

"అది నీకు ఇంత చేశాక కూడానా?" అన్నాడు హసన్ ఆశ్చర్యంతో.

"ఇంతకు రెట్టింపు చేసినా దానిమీద నాకు ఆగ్రహం లేదు. దాన్ని నా భార్యగా చేసుకోవాలన్న కోరిక తప్పించి జీవితంలో నాకు మరే కోరికా లేదు." అన్నాడు "పాదరసం."

"అంత బలమైన కోరిక తీరవలిసిందే. నువ్వూ దానిలాగే అందగాడివి. మీ కిద్దరికీ జోడు సరిపోతుంది." అన్నాడు హసన్.

"మనవాడికి నువు కాస్త సహాయం చెయ్యి, హసన్." అన్నాడు అహ్మద్.

హసన్ కొంచెం ఆలోచించి, "పాదరసం" అనుసరించదగిన మార్గం తెలిపాడు.

"పాదరసం" తన ఒళ్ళంతా నల్ల రంగు పూసుకుని నీగ్రోలాగా తయారై, నీగ్రో దుస్తులు ధరించి, కొంత డబ్బూ, ఇంత భంగూ తీసుకుని, కూరలబజారుకు వెళ్లాడు. అక్కడ అతనికి దిలైలా వంటవాడు కూరలు కొంటూ కనిపించాడు. "పాదరసం" వాణ్ణి పట్టుకుని, "అన్నా, నేనీ నగరానికి కొత్తగా వచ్చాను. సాటి నీగ్రోవు కనిపించావు. సారా దుకాణానికి పోదాం పద. స్నేహపూర్వకంగా తాగుదాం," అన్నాడు.

అందోళనతో అహ్మద్ క్రితం రాత్రి తిండి తినలేదు. కన్ను మూయలేదు. తెల్లవారుతూనే అతను తన సాటి కొత్వాలయిన హసన్‌ను పిలిపించి సలహా అడిగాడు.

వారిద్దరూ మాట్లాడుతూ ఉండగానే "పాదరసం" తిరిగి వచ్చాడు.

అతను తన అనుభవమంతా కొత్వాళ్ళు ఇద్దరికీ వివరంగా చెప్పాడు.

అంతా విని హసన్ చిరునవ్వు నవ్వి, "బాగ్దాదులో ఒక చిన్నది ఇంత పని చేసిందంటే అది దిలైలా కూతురు జీనాబ్ తప్ప మరొకతె కాదు. అది నీకు చిక్కితే ఏం చెయ్యదలిచావు?" అని అలీని అడిగాడు.

"సారా దుకాణంలో కూర్చుని తాగ టానికి నాకు తీరిక ఎక్కడుంది? నువే మా యింటికి రాగూడదూ? నీకు ఏ రకం తాగుడు కావాలన్నా అక్కడ ఉన్నది. ఆపైన నీకు భోజనం కూడా పెడతాను," అన్నాడు దిలైలా వంటవాడు.

"పాదరసం" కోరినదీ అదే. అతను వంటవాడి వెంట దిలైలా ఇంటికి చేరి, వంట ఇంట ప్రవేశించాడు.

త్వరలోనే దిలైలా, జీనాబ్ భోజనానికి వచ్చారు. వంటవాడు వారికి ఆహారమూ, తాగుడూ సిద్ధం చేసి, ఒక్కొక్కటే తీసుకు పోయి వారికి అందించసాగాడు. వాడు వంటగది నుంచి అవతలికి వెళ్ళిన సమ యంలో "పాదరసం" వాళ్ళ తాగుడు లోటాలలో భంగు కలిపేశాడు.

కొంతసేపటికి భంగు తన ప్రభావం చూపింది. దిలైలా, జీనాబ్, నలభైమంది నీగ్రో బానిసలూ, వంటవాడూ, ఎక్కడి వాళ్ళక్కడ ఒళ్ళు తెలియకుండా పడి పోయారు. ఆఖరుకు వేటకుక్కలు కూడా భంగుకు గురిఅయాయి.

ఇప్పుడు "[illegible]రసం" యథేచ్ఛగా ఇల్లంతా గాలించి, దిలైలా ధరించే అధికార దుస్తులూ, వెండి పావురంగల బంగారు టోపీ, నీగ్రోలు వేసుకునే ఎర్ర జరీ






దుస్తులూ పోగుచేసి మూట కట్టుకున్నాడు. తరవాత అతను మిద్దె మీదికి వెళ్ళి, గూళ్లలో నుంచి పావురా లన్నిటినీ బయటికి తీసి, పెద్ద పంజరంలో పెట్టుకున్నాడు. తరవాత ఒక చీటీ మీద, "ఈ పని చేసినవాడు వీరాగ్రేసరుడైన 'పాదరసం' అలీ తప్ప మరెవరూ కాదు!" అని రాసి పెట్టి, మూటనూ, పంజరాన్నీ తీసుకుని అహ్మద్ ఇంటికి వెళ్ళిపోయాడు.

చీకటి పడుతూండగా దిలైలాకు స్పృహ వచ్చింది. ఆమె లేచి "పాదరసం" పెట్టి పోయిన చీటీ చూసుకుని, పోయిన వస్తువు లేవో తెలుసుకున్నది. అవన్నీ ఖలీఫా సొత్తే!

దిలైలాకు పెద్ద సమస్య వచ్చి పడింది. ఈ దొంగతనం వివరాలు బయటపడితే ఆమె ఉద్యోగంతోబాటు పరువూ పోతుంది. ఆ తరవాత "పాదరసం" మీద పగ తీర్చుకున్నప్పటికీ ప్రయోజనం ఉండదు. "పాదరసం" చేత ఈ పని చేయించినవాడు అహ్మదే అయిఉంటాడు. అహ్మద్ మీద పగ తీర్చుకోవటానికని తాను తన కూతురి ద్వారా "పాదరసం" అలీకి పరాభవం చేయిస్తే, అహ్మద్ ఆ "పాదరసం" ద్వారానే తన మీద పగ సాధించాడు. రెంటికీ సరి పోయింది. తాను వెళ్ళి అహ్మద్ కాళ్ళు పట్టుకుని, పోయిన సొత్తు తిరిగి తెచ్చుకోవటం తప్ప దిలైలాకు గత్యంతరం లేదు. పగ సాధించుకున్నాడు గనక అహ్మద్ తనతో రాజీకి రావచ్చు.

"ఇప్పుడే వస్తా," అని కూతురికి చెప్పి దిలైలా అహ్మద్ ఇంటికి వెళ్ళింది.

దిలైలా అహ్మద్ ఇంటికిచేరేసరికి అహ్మద్, హసన్, "పాదరసం" భోజనాలకు కూర్చుని ఉన్నారు. ఆమెను చూడగానే అహ్మద్, హసన్‌లు లేచి నిలబడి, తలలు వంచి సలాములు చేసి, "దయ చెయ్యండి, దిలైలా! మాతోబాటు భోజనం చెయ్యండి!" అని గౌరవంగా ఆహ్వానించారు.

వారి ముందున్నది పావురాల మాంస మని తెలియగానే దిలైలాకు కళ్ళు చీకట్లు కమ్మాయి, తల తిరిగిపోయింది.

ఆమె వణుకుతున్న కంఠంతో, "అహ్మద్‌కు నా మీద ఎంత కసి ఉంటే మటుకు, ఖలీఫా ప్రాణప్రదంగా చూసుకునే టపా పావురాలను దొంగతనంగా తెప్పించు కుని, వండించుకు తినటం భావ్యమా? దొంగతనంలో మాత్రం నియమం ఉండ వద్దా?" అన్నది.

హసన్ దిలైలాను అనునయిస్తూ, "కంగారు పడకమ్మా! టపా పావురాలకు ఏ ఆపదా రాలేదు. ఖలీఫా సొత్తంతా సుర క్షితంగానే ఉన్నది. ఈ చిన్నవాడికి ఒకే ఒక కోరిక ఉన్నది. దానికి నువు అంగీక రించినట్టయితే నీ పావురాలూ, దుస్తులూ ఈ క్షణాన నీకు తిరిగి వస్తాయి. అందుకు నేను హామీపడతాను," అన్నాడు.

"ఆ కోరిక ఏమిటో చెప్పండి. నేను కాదనే స్థితిలో లేనని మీకు తెలుసుగదా!" అన్నది దిలైలా.

"మరేమీ లేదు. ఈ కుర్రవాడు, అలీ నీ కుమార్తెను, జీనాబ్‌ను పెళ్ళాడగోరు తున్నాడు. దానికి నువు అంగీకరించాలి," అన్నాడు హసన్.




"అయ్యో, నాయనా! నన్నింత శ్రమ పెట్టినది ఇందుకా? నా అంగీకారంవల్ల చిన్న మెత్తు లాభం లేదు. మా జీనాబ్‌కు వయసు వచ్చేదాకా దానికి రక్షకుడు దాని మేన మామ—నా పెద్దన్న జురేక్. ఆయన సరే ననందే ఈ పెళ్ళి జరగదు. మీకు తెలియని దేముందీ? జురేక్ శతమొండి. ఎడ్డెమంటే తెడ్డెమనే రకం. ఆయనని ఈ పెళ్ళికి ఒప్పించేభారం 'పాదరసం' అలీ తనమీద వేసుకోవాలి. అది తప్ప మరోమార్గం లేదు," అన్నది దిలైలా.

"అలా అయితే, నేను జురేక్‌ను కలుసు కుని, ఆయనచేత సరేననిపించి, ఆ తర




వాతనే జీనాబ్‌ను పెళ్ళాడతాను," అన్నాడు "పాదరసం."

దిలైలా తన దుస్తులూ, పావురాలూ తీసుకుని వెళ్ళిపోయింది.

దిలైలా అన్న జురేక్ ఒకప్పుడు ఆరితేరిన దొంగ. ఆ కాలంలో అతను చేసిన దొంగతనాలకు దర్యాప్తూ, విచారణా ఉండేవి కావు. అతను కూర్చున్న చోటునుంచి కదలకుండా ఎప్పుడు, ఎక్కడ ఏ దొంగతనం చెయ్యాలన్నా చేసేవాడు. ఇప్పుడు ముసలితనం వచ్చేసింది; దొంగతనాలు మానేసి, చేపలు వేయించి అమ్ముకుని కాలక్షేపం చేస్తున్నాడు.



తన దుకాణానికి కొనుగోలు దార్లను ఆకర్షించటానికి జురేక్ ఒక యుక్తి పన్నాడు. అతను తన దుకాణం వాకిలికి ఒక వెయ్యి దీనారాల సంచీ వేళ్ళాడ గట్టి, దాన్ని ఎవరు ఎత్తుకు పోగలిగితే వాళ్ళు ఉంచుకోవచ్చునని ప్రకటన చేశాడు.

ఎలాగైనా ఆ సంచీ కాజేతామని వేల సంఖ్యలో జనం వచ్చి వేయించిన చేపలు కొన్నారు. కాని ఒక్కరైనా ఆ సంచిని కాజెయ్యలేకపోయారు. ఎందుచేతనంటే, ఎవరైనా ఆ సంచిని తాకితే చాలు, దుకాణం అంతటా గంటలూ, డప్పులూ మోగేవి. అవి మోగగానే జురేక్, దొడ్లో ఉన్నాసరే, పరిగెత్తుకుంటూ వచ్చి దొంగను పట్టేసేవాడు. లేకపోతే, దొంగతనం చెయ్యదలిచినవాళ్ళను దూరం నుంచే సీసపుగుళ్ళు విసిరి కొట్టేవాడు. అలా కాళ్ళూ, చేతులూ విరుచుకున్నవాళ్ళూ, గాయపడినవాళ్ళూ బాగ్దాదులో చాలామంది ఉన్నారు.

"పాదరసం" జురేక్ వద్దకు వెళ్ళి, తన ఊరూ, పేరూ చెప్పుకుని, "నేను కొత్వాల్ అహ్మద్ గారింట బస చేస్తున్నాను. నాకు మీ మేనగోడలయిని జీనాబ్‌ను పెళ్ళాడాలని ఉన్నది. అందుకు మీ అనుమతి కోరటానికి వచ్చాను," అన్నాడు.

జురేక్ తల అడ్డంగా తిప్పి, "నువు జీనాబ్‌ను పెళ్ళాడటానికి నేను ఏమాత్రమూ ఒప్పుకోను. నువు జీనాబ్‌కు ఎంతమాత్రమూ తగవు," అన్నాడు.

జురేక్ తన దుకాణంలో వేళ్ళాడ గట్టిన దీనారాల సంచీ కాజేస్తే ముసలాడు పెళ్ళికి ఒప్పుకుంటాడని తోచి, "పాదరసం" ఆ సంచీని కాజెయ్యాలని నిశ్చయించుకున్నాడు.

అందుకని అతను నిండు చూలాలి వేషం ధరించి, మర్నాడు జురేక్ దుకాణానికి వచ్చి, చేపలు బేరం చేస్తూ, నొప్పులు వచ్చినట్టు అభినయించాడు. అది చూసి జురేక్, తన భార్యను కేక వెయ్యటానికి కంగారుగా లోపలికి వెళ్ళాడు.

జురేక్ లోపలికి పోగానే "పాదరసం" చప్పున దీనారాల సంచీని పట్టుకున్నాడు. అతని చెయ్యి సంచీకి తగులుతూనే దుకాణమంతటా గంటలూ, డప్పులూ మోగాయి.

వెంటనే జురేక్ దుకాణంలోకి వచ్చి, సంచీని వదిలి పారిపోతున్న "పాదరసం" మీదికి సీసంగుండు విసిరాడు.

ఆ గుండు దెబ్బకు "పాదరసం" వీధిలో కుప్ప కూలిపోయాడు. అతను వెంటనే లేచి, కుంటుకుంటూ అహ్మద్ ఇల్లు చేరుకున్నాడు.



ఈ సంఘటన కళ్ళారా చూసినవాళ్ళు జురేక్‌ను రకరకాలుగా తిట్టుతూ, "నువు మనిషివా, పశువువా? పాపిష్టి డబ్బుతో అందరికీ ఆశ పెట్టటంగాక, నిండు చూలాలిని సీసంగుండుతో కొడతావా?" అన్నారు.

"ఇటువంటి నీతులు చాలా విన్నాం!" అన్నాడు జురేక్ నిర్లక్ష్యంగా.

దెబ్బ తిని కూడా "పాదరసం" తన పట్టు వదలలేదు. దెబ్బ నయం కాగానే అతను జురేక్ దుకాణానికి మళ్ళీ బయలుదేరాడు. జురేక్ చేతిలో చావుకైనా సిద్ధపడ్డాడు గాని, అతను జీనాబ్‌ను పెళ్ళాడే ప్రయత్నం మానదలచ లేదు.

ఈ సారి "పాదరసం" ఒక నౌకరు వేషం ధరించి, ఒక సంచీ చేత పట్టుకుని, జురేక్ దుకాణానికి వెళ్ళి, "వేయించిన చేపలు వేడివేడిగా ఇప్పించండి," అని అడిగాడు.

"వేడివేడి చేపలు కావాలంటే నిప్పు చేసేదాకా ఆగు," అని జురేక్ అవతలికి వెళ్ళాడు. వెంటనే "పాదరసం" దీనారాల సంచీ పట్టుకున్నాడు. దుకాణం అంతటా గంటలూ, డప్పులూ గందరగోళంగా మోగాయి.

జురేక్ ఒక్క దూకున దుకాణంలోకి వచ్చి పడి, "నీ దొంగ వేషం నేను కనిపెట్టలేదనుకున్నావురా?" అని, ఒక సీసం గుండు తీసి, "పాదరసం" తలకు గురి పెట్టి, బలంగా విసిరాడు.

"పాదరసం" చప్పున వంగాడు. జురేక్ విసిరిన సీసంగుండు వీధిలోకి పోయి, వీధి వెంట నడిచే ఒక మనిషి నెత్తిన ఉన్న పెరుగు ముంతకు తగిలింది. ముంత పగిలి, అందులోని పెరుగు చింది, ఒక కాదీ ముఖం మీదా, గడ్డం మీదా పడింది.

ఇది చూస్తున్నవాళ్ళు జురేక్‌తో, "కాదీ గారు నీ పాపిష్టి డబ్బుకు వడ్డీ కట్టి నీకు వడ్డిస్తారులే ఉండు!" అన్నారు.

—(ఇంకా వుంది)





# భూతాల బెడద

ఒక గ్రామంలో తల్లి కూతుళ్ళుండేవాళ్ళు. వాళ్ళు చాలా పేదవాళ్ళు. వాళ్ళు ఒక గుడిసెలో ఉండేవాళ్ళు. వాళ్ళకు వేరే దిక్కులేకపోవటంచేత, తల్లి అక్కడా, అక్కడా చాకిరి చేసి డబ్బులు తెచ్చుకునేది. ఆ డబ్బుతో తల్లి కూతుళ్ళు ఏ పూటకాపూట గడిపేవాళ్ళు.

ఇలా ఉండగా తల్లి జబ్బు పడింది. తల్లిని చూసే భారం కూతురి పైన పడింది. ఆ పిల్ల పేరు గౌరి. ఆమె చాలా చురుకైనది. ఇంటిపనులన్నీ చక్కగా చెయ్యగలదు. ఇప్పుడామె బయటికి వెళ్ళక తప్పలేదు.

అందుచేత గౌరి, ఊరికి కొంచెం దూరంగా ఉన్న తోపుల్లోకి వెళ్ళి, ఎండిన పుల్లలూ, కొమ్మలూ ఏరి, కట్టగట్టి తెచ్చి ఊళ్ళో అమ్మి, ఆ డబ్బులతో తనకూ, తల్లికీ జరిగిపోయేటట్టు చూడసాగింది.

ఆ తోపుల అవతల అరణ్యంలో రెండు భూతాలుండేవి. అవి చాలాకాలం క్రితమే పిశాచజన్మ ఎత్తాయి. ఎవరైనా మంచి వాళ్ళకు మేలుచేస్తే పిశాచజన్మ పోతుందని వాటి నమ్మకం.

అందుచేత, పెద్దభూతం చిన్నభూతంతో, "ఈ అడవి అవతల తోపుల్లోకి ఒక చిన్న పిల్ల వచ్చి వంటచెరుకు ఏరుకుంటున్నది. నేనా పిల్లకు సహాయంచేసి విమోచనం పొందుతాను," అన్నది.

"నీకు విముక్తి కలిగితే నేనూ అదే పని చేస్తాను," అన్నది చిన్నభూతం.

పెద్దభూతం తోపులోకి వచ్చి, గౌరి వచ్చే లోపల అక్కడ ఉన్న ఎండుపుల్లలూ, కొమ్మలూ ఏరి, ఒకచోట పోగు పెట్టింది. గౌరి వస్తూనే ఆ పోగును చూసి, "నా కన్న ముందే ఎవరో వచ్చి వీటిని ఏరి పెట్టుకున్నట్టున్నారు," అనుకున్నది. ఆమె తోపు

పి. కళ్యాణరావు






లన్నీ తిరిగింది, కాని ఎక్కడా ఒక్క ఎండుపుల్ల కనిపించలేదు. అందుచేత ఆమె వట్టిచేతులతో ఇంటికి పోయింది.

ఆ రోజు వృథాగా పోయింది. ఇక పుల్లలు ఏరి డబ్బు సంపాదించటం సాధ్యం కాదనీ, తన మీద ఎవరో పోటీకి వచ్చారనీ గౌరికి అనిపించింది. అరణ్యంలోకి పోవచ్చు గాని, గౌరికి ధైర్యం చాలలేదు. ఇంకేదన్నా పని దొరుకుతుందేమోనని గ్రామంలో తిరుగుతూండగా ఒక ముసలిది తన ఇంటి బయట అరుగు మీద కూర్చుని పూల దండలు కట్టుతూ కనిపించింది. ఆమె పక్కన తట్టలో పూలున్నాయి. ముసలి దానికి వేళ్ళు స్వాధీనంలో లేకపోవటంచేత పూలమాలలు కట్టటం ప్రయాసగా ఉండటం గౌరి గమనించింది.

"అవ్వా, నీ కెందుకు శ్రమ? నేను నీకు మాలలు కట్టిపెట్టుతాను. నీకు తోచినది ఇయ్యి," అన్నది గౌరి.

"ఏం చెయ్యను, తల్లీ? ఇది నా వృత్తి. వేళ్ళు స్వాధీనంలో ఉండటం లేదు. నీకు చాతనయితే మాలలుకట్టి, అంగడిలో అమ్మి డబ్బు తీసుకురా. వచ్చిన డబ్బులో నాలుగో వంతు నీకిస్తాను," అన్నది ముసలిది.

ఆమె గౌరిని అరుగు మీద కూర్చోబెట్టి, తన పని చూసుకునేటందుకు ఇంట్లోకి వెళ్ళింది.

కిందటి రోజు గౌరికి సహాయం చెయ్యటానికి వ్యర్థ ప్రయత్నం చేసిన భూతం ఇవాళ మళ్ళీ సహాయం చెయ్య నిశ్చయించుకున్నది. గౌరి గంపలో నుంచి ఒక్కొక్క పువ్వు తీసినప్పుడల్లా భూతం ఆ గంపలో ఒక్కొక్క పువ్వు వేస్తూ వచ్చింది.

కొంతసేపయాక ముసలిది బయటికి వచ్చి, "అస్తమానం కావస్తున్నది. ఇంకా మాలలు కట్టటం పూర్తి కాలేదా? గంపలో పూలు గంపనిండా అలాగే ఉన్నాయే?



ఇంతసేపూ ఏం చేస్తున్నావు? గోళ్లు గిల్లుకుంటున్నావా," అన్నది గౌరితో.

"చూడు, అవ్వా, ఎంత పొడుగు మాల కట్టానో!" అంటూ గౌరి తాను కట్టిన మాలను మూడు బారల నిడివిన చూపింది. కాని మరుక్షణం ఆమె గంప కేసి చూసి, "అరె, పూలన్నీ అలాగే ఉన్నాయే! ఇదేదో దయ్యపుగంప లాగున్నదే!" అన్నది.

"నువే దయ్యం లాగున్నావు! ఎవరు, తల్లీ, నువు? చేసిన సహాయం చాల్లే. ఇక వెళ్ళు!" అంటూ ముసలిది గంపలో పూలనూ, గౌరి కట్టిన మాలనూ దూరంగా పారేసింది. గౌరికి సహాయం చెయ్యటానికి పెద్ద భూతం చేసిన రెండో ప్రయత్నం కూడా విఫలమయింది.

మర్నాటి నుంచి గౌరి ఇంటి వద్దనే ఉండి, మట్టిబొమ్మలు చేసి, వాటితో జీవించ నిశ్చయించింది. ఆమె తండ్రి జీవించి ఉండగా మట్టిబొమ్మలు చేసేవాడు. అతను పోయినాక బొమ్మల అచ్చులు మూలపడి ఉన్నాయి. గౌరి కొంత రేగడి మట్టి తెచ్చి, దాన్ని తన ఇంటి ముందు తడిపి పెట్టింది.

ఈసారి అరణ్యంలో ఉండే చిన్న భూతం గౌరికి సహాయం చేసి చూద్దామనుకున్నది. అది చిలక రూపంలో జమీందారు



ఇంటికి వెళ్ళి, వారింటి నుంచి ఒక వజ్రాన్ని తస్కరించి తెచ్చి, గౌరి తడిపి ఉంచిన మట్టిలో వేసింది.

గౌరి లోపలికి వెళ్ళి, బొమ్మల అచ్చులలో నుంచి ఏనుగు బొమ్మ చెయ్యటానికి పనికి వచ్చేవి ఏరి తెచ్చుకునే సమయంలో ఈ పని జరిగిపోయింది.

తాను కలిపి పెట్టిన మట్టిలో మణి ఉన్న సంగతి గౌరి గమనించనే లేదు. ఆమె ఆ మట్టితో ఏనుగు బొమ్మ తయారు చేసి, అచ్చు నుంచి తీసి ఆరబెట్టింది. మర్నాడు ఉదయం దానికి రంగులు వేసి మళ్ళీ ఆర బెట్టింది. ఆ మర్నాడు ఆమె ఆ ఏనుగు బొమ్మను జమీందారు ఇంటికి తీసుకుపోయి, కొనమని వేడుకున్నది.

జమీందారు పిల్లలు ఆ బొమ్మ కావా లన్నారు. జమీందారు దాన్ని కొని, గౌరి చేతిలో ఒక రూపాయి పెట్టి పంపేశాడు. అప్పటికే వజ్రం పోయిన సంగతి తెలిసి జమీందారు చాలా ఆందోళన పడుతున్నాడు. దొంగ దొరకలేదు. అందరు నౌకర్లనూ, అన్ని ప్రదేశాలనూ సోదా చేశారు, కాని లాభంలేకపోయింది.

ఇంతలో జమీందారు పిల్లలు ఏనుగు బొమ్మతో ఆడుకుంటూ ఉండగా, అది కాస్తా ఎవరి చేతి నుంచో కిందపడి పగిలింది. ఆ పగిలిన ఏనుగు ముక్కలలో పోయిన వజ్రం దొరికింది.

జమీందారు గౌరిని పిలిపించి, ఆమెను దొంగగా నిర్ణయించటానికి ప్రయత్నించాడు. కాని గౌరి రెండు రోజులుగా ఇల్లు కదల లేదని రుజువయినాక ఆమెకు కొంత బహు మానం ఇచ్చి పంపేశాడు.

అది మొదలు గౌరి బొమ్మలు తయారు చెయ్యటంలో నైపుణ్యం సంపాదించి, తననూ తల్లినీ కూడా పోషిస్తూ వచ్చింది.

అరణ్యంలో ఉండే రెండు భూతాలకూ పిశాచజన్మ నుంచి విముక్తి లభించలేదు.






# అతిగారాబం

ఒక గ్రామంలో ఒక గృహస్థుకు ముగ్గురు ఆడపిల్ల లుండేవాళ్ళు. తల్లిదండ్రులు వాళ్ళను గారాబంగా పెంచి, పెళ్ళిళ్ళు చేసి, ఒకే రోజు ముగ్గురినీ అత్తవారిళ్ళకు పంపేశారు.

కాని మర్నాటి ఉదయానికల్లా పెద్ద కూతురు ఏడ్చుకుంటూ పుట్టింటికి తిరిగి వచ్చింది. తల్లీ, తండ్రీ ఆమెను ఓదార్చి, ఆమె ఏడుపుకు కారణం అడిగారు.

"నిన్న సాయంకాలం నేనూ, నా భర్తా మునగచెట్టు కింద కూర్చుని మాట్లాడు కుంటూండగా, గాలికి ఒక మునగపువ్వు రాలి నా మీద పడింది. అది చూసి కూడా నా భర్త, 'దెబ్బేమైనా తగిలిందా?' అని మాటవరసకైనా అడగలేదు. అంత నిర్లక్ష్య మైన భర్తతో ఎవతె మాత్రం ఎలా కాపరం చేస్తుంది? అందుకనే వచ్చేశాను," అన్నది పెద్దకూతురు.

మధ్యాన్న మయేసరికల్లా రెండోకూతురు మూతిముడుచుకుని హడావిడిగా పుట్టింటికి వచ్చేసింది.

"ఏమమ్మా, వచ్చేశావేం?" అని తల్లి దండ్రులు అడిగారు.

"చూడమ్మా! ఈ ఉదయం నేను మజ్జిగ చిలికి వెన్న తీసి ముద్ద చేస్తుంటే, వెన్నముద్ద కాస్తా నా కాలి మీద పడింది. నా భర్త అక్కడే ఉండి కూడా, 'కాలికి గాయం తగిలిందా?' అని చూడలేదు. అంత పట్టించుకోని మనిషితో ఎలా కాపరం చెయ్యటం?" అన్నది రెండోకూతురు.

ఆ సాయంకాలానికల్లా మూడోకూతురు ధుమధుమ లాడుతూ, మూటా ముల్లేతో సహా పుట్టిల్లు చేరుకున్నది.

"నువ్వూ బయలుదేరి వచ్చావా! నీకేం కష్టం వచ్చింది, తల్లీ?" అని తల్లిదండ్రులు ఆమెను అడిగారు.

నిర్మల జి.

"నా భర్త ఎటువంటి కర్కోటకుడను కున్నారు? భోజనం చేసిన తరవాత నేను తమలపాకుల ఈనెలు తీసి, చిలకలు చుట్టి తన కివ్వాలట! తమలపాకుల ఈనెలు తీసేటప్పుడు చేతులు కోసుకుపోవూ? అది కూడా తెలీదు ఆ మనిషికి!" అన్నది మూడోకూతురు.

ఈ కూతుళ్ళ విషయంలో ఏం చెయ్యాలో తల్లికీ, తండ్రికీ పాలుబోలేదు. వాళ్ళను అతి రూపంగా పెంచటం తమదే తప్పు అని వాళ్లు తెలుసుకున్నారు. తమ కూతుళ్ళ ఈ ప్రవర్త నకు కారణం తామే అని తెలిస్తే లోకం తమనే నిందిస్తుంది.

కూతుళ్ళకు బుద్ధి చెప్పి, కాపరాలకు పంపటం ఎలాగా అని తల్లి ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చింది.

ఆ రాత్రి అందరికీ భోజనాలు వడ్డించి చివరకు తల్లి కూర్చున్నది. ఆమె పాత్రలలో మిగిలినదంతా తన పళ్ళెంలో దిమ్మరించు కుని, అంతా తినేసి, చెయ్యి కడిగేసుకుని, గుడ్ల నీరు కుక్కుకుంటూ ఒక మూల కూర్చున్నది.

ఈ సంగతి గమనించి కూతుళ్ళు, ముగ్గురూ తల్లి దగ్గిరకుపోయి, "ఏమమ్మా? ఏం జరిగింది? ఎందు కేడుస్తున్నావు?" అని అడిగారు.



"ఎందుకు అడుగుతారు? నా కష్టాలు ఒకరు అర్చేవా, తీర్చేవా?" అన్నది తల్లి బెక్కుతూ.

"అదేమిటమ్మా? మాకు చెప్పక పోతే ఇంకెవరితో చెబుతావు? ఏం జరిగింది?" అని కూతుళ్ళు తల్లిని ఒత్తిడి చేశారు.

"చూడండే, అమ్మాయిలూ! నేను భోజనం చేశానా? అన్నీ అడుగంటాయి. 'అయ్యో, నువు కడుపునిండా తిన్నావా? మారు వడ్డించుకున్నావా?' అని మీ నాన్న అడిగిన పాపాన పోయినారా? ఇటువంటి మనిషితో నేను గనక ఇన్నేళ్ళు కాపరం చేశాను. ఇక నా వల్ల కాదు. మీ రెట్లాగూ మీ కాపరాలు మానుకుని రానే వచ్చారు. మనమంతా కలిసి ఎక్కడికన్నా పోయి హాయిగా బతుకుదాం, పదండి, బయలు దేరండి." అన్నది తల్లి.

తల్లి మాటలు కూతుళ్ళకు మరీ అతిశయంగా తోచాయి.

"మరీ చోద్యంగా మాట్లాడతా వేమిటే, అమ్మా? ఈ మాత్రం దానికే ఎవరన్నా ఇల్లు విడిచిపెట్టి, పరాయిచోటుకు పోతారా?" అన్నారు వాళ్ళు.

"నాది చోద్యమని మీరేనా అంటున్నది? ఆశ్చర్యంగా ఉన్నదే! మునగపువ్వు మీద పడితే దెబ్బ తగలడమూ, వెన్నముద్ద కాలి మీద పడితే గాయం కావటమూ, తమల పాకుల ఈనెలు తీస్తే వేళ్ళు కోసుకు పోవటమూ చోద్యం కావా ఏం? ఈ వంకలు పెట్టి మీరు ముగ్గురూ మీ భర్తలనూ, కాపరాలనూ వదిలిపెట్టి రాలేదూ? పగలంతా వెట్టి చాకిరీ చేసిన పెళ్ళాం కడుపునిండా తిన్నదో లేదో కనుక్కోని భర్తను నేను వదిలేస్తానంటే మీకు చోద్యం అయిందా?" అన్నది తల్లి.

తల్లి మాటలు కూతుళ్ళ తలకెక్కాయి. వాళ్ళు మారుమాటాడక, ఆ రాత్రి గడిచి తెల్లవారగానే, ఎవరి భర్తల దగ్గిరికి వారు వెళ్ళిపోయారు.



# చక్రవడ్డీ

ఒక ఊళ్ళో ఒక వర్తకుడు ఉండేవాడు. అతను పేదవాళ్ళకు రూపాయా, అర్ధా అప్పుపెట్టి నెలకు రెట్టింపు చొప్పున చక్రవడ్డీతో తీసుకునేవాడు.

కొట్టు మీదికి బేరానికి వచ్చిన ఒక పెద్దమనిషి, "ఏమయ్యా, షావుకారూ? నువ్వు చక్రవడ్డీ పుచ్చుకోవటమేనా ఇవ్వటం కూడా ఉందా?" అని అడిగాడు.

"అదేం మాట, పంతులుగారూ? పుచ్చుకునేటప్పుడు పుచ్చుకుంటాను, ఇచ్చేటప్పుడు ఇస్తాను," అన్నాడు వర్తకుడు.

ఆ పెద్దమనిషి కొన్ని సరుకులు కొని డబ్బిచ్చాడు.

"నేను మీ కింకో అర్ధణా ఇవ్వాలి. గుర్తుంచుకోండి," అన్నాడు వ్యాపారస్తుడు.

"తరవాత వడ్డీతో సహా ఇద్దువుగానిలే!" అంటూ ఆ పెద్దమనిషి వెళ్ళిపోయాడు.

రెండేళ్ళు గడిచాయి. ఆ పెద్దమనిషి వచ్చి, "ఏమయ్యా, నా బాకీ తీరుస్తావేమిటి? మరిచిపోయావా? రెండేళ్ళ క్రితం నాకు అర్ధణా బాకీ ఉన్నావు!" అన్నాడు.

వ్యాపారస్తుడు ఒక రూపాయి తీసి ఇవ్వబోయాడు.

"లెక్క సరిగా కట్టవయ్యా! నెలకు నెలకూ అసలును రెట్టింపు చెయ్యి," అన్నాడు పెద్దమనిషి.

లెక్క కడితే వ్యాపారస్తుడు పెద్దమనిషికి రెండు లక్షల అరవైరెండువేల నూటనలభై నాలుగు రూపాయలు ఇవ్వవలసి వచ్చింది.

వ్యాపారస్తుడు తన వడ్డీవ్యాపారం మానే షరతు మీద పెద్దమనిషి ఆ మొత్తాన్ని విడిచిపెట్టాడు!

—వై. వీరేంద్రనాథ్





# మహాభారతం

అగ్నిహోత్రుడు తనపాట్లు చెప్పగా విని బ్రహ్మ ఒక్క క్షణం ఆలోచించి, "నర నారాయణులు కృష్ణార్జునులుగా భూమి మీద అవతరించి ఉన్నారు. వారు ఖాండవ వన ప్రాంతానికి వస్తారు. ఆ సమయం కని పెట్టి వారి సహాయం కోరు. వారు నీకు సహాయ పడినట్టయితే, ఇంద్రుడు కాదు గదా, దేవతలందరూ అడ్డుపడినా, నీ పని నిరాటంకంగా సాగుతుంది," అని చెప్పాడు.

అందుచేత అగ్ని ఈనాడు కృష్ణార్జునుల సహాయం కోరవచ్చాడు.

అగ్నిహోత్రుడు తన సహాయం కోరటం విని అర్జునుడు, "అగ్నిహోత్రుడా, ఇంద్రాది దేవతలతో యుద్ధం చెయ్యటానికి తగిన అస్త్రాలన్నీ నాకు తెలుసు. అయితే నా కిప్పుడు మంచి ధనుస్సూ, మంచి గుర్రాలను పూన్చిన దృఢమైన రథమూ లేవు. నాకూ, కృష్ణుడికీ తగిన ఆయుధాలూ, మమ్మల్నిద్దరినీ మోయగల రథమూ సంపాదించావంటే నీ కోరికతీరుస్తాను," అన్నాడు.

అగ్నిహోత్రుడు వరుణుణ్ణి తలుచుకున్నాడు. వరుణుడు ప్రత్యక్షమయాడు. అగ్ని, వరుణుడితో, "మహానుభావా, చంద్రుడు నీ కిచ్చిన గాండీవ మనే ధనుస్సూ, అక్షయతూణీరాలూ, కపిధ్వజం గల రథమూ, చక్రాయుధమూ నీ వద్ద ఉన్నాయిగదా, వాటితో నా కిప్పుడు అవసరం కలిగింది. బదులియ్యి," అన్నాడు.

వరుణుడు అగ్నిహోత్రుడికి అతను కోరినవియిచ్చి, అంతర్ధానమయాడు. అగ్ని

**20. ఖాండవవన దహనం**



హోత్రుడు కృష్ణార్జునులకు వాటిని ఇచ్చాడు. చక్రాన్ని కృష్ణుడు తీసుకున్నాడు. గాండీవాన్నీ, అక్షయతూణీరాలనూ అర్జునుడు తీసుకున్నాడు. గాండీవం సామాన్యమైన విల్లు కాదు. అది లక్ష ఆయుధాలకు సమానం. ఆ రథాన్నీ, అక్షయతూణీరాలనూ పూర్వం విశ్వకర్మ నిర్మించాడు. వాటిని చంద్రుడు దేవాసుర యుద్ధాలలో ఉపయోగించాడు.

కృష్ణుడు తీసుకున్న చక్రాయుధం శత్రువులను చంపి తిరిగి వచ్చే శక్తిగలది. వరుణుడు అంతర్థానమయే ముందు కృష్ణుడికి కౌమోదకి అనే గదను కూడా ఇచ్చాడు.



ఆయుధాలు స్వీకరించి కృష్ణార్జునులు, "ఓ అగ్నిదేవుడా, ఇక నువు ఖాండవ వనాన్ని దహించటం ప్రారంభించు. ఇంద్రుడు వచ్చినా మమ్మల్ని ఏమీ చేయలేడు," అన్నారు.

అగ్నిహోత్రుడికి ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చింది. అతను ఖాండవవనం ప్రవేశించి, అందులోని మహా వృక్షాలనూ, లతలనూ, ఓషధులనూ, వనస్పతులనూ దహించసాగాడు. కార్చిచ్చు వేడికి తట్టుకోలేక వనంలోని వివిధ ప్రాణులు బయటికి పారిపోతూ ఉంటే, కష్ణార్జునులు వాటిని పోనివ్వక, అగ్నికి ఆహుతి అయేటట్టు చేశారు. ఆకాశంలోకి ఎగిరిపోవటానికి ప్రయత్నించిన పక్షులు, వేడికి మాడి తిరిగి మంటలలోనే పడిపోయాయి.

ఖాండవవనం అతి దారుణంగా తగలబడుతూ, అకాలప్రళయం అనిపించింది. దాని వేడికి భయపడి దేవతలు ఇంద్రుడి దగ్గిరికి వెళ్ళి, లోకాలన్నీ బూడిద అయిపోతున్నాయని చెప్పారు. ఖాండవవనం మీద భారీగా వర్షం కురిపించమని ఇంద్రుడు పర్జన్యుణ్ణి ఆజ్ఞాపించాడు.

ఎంత పెద్ద ఎత్తున వర్షం కురిసినా, కురిసిన నీరు కురిసినట్టే ఆవిరి అయిపోయి,



అగ్నిని చల్లార్చలేకపోయింది. అది చూసి ఇంద్రుడికి చాలా కోపం వచ్చింది. ఖాండవ వనం మీద ఒక్కసారి వర్షం కురవమని అతను మేఘాలన్నిటినీ ఆజ్ఞాపించాడు.

అర్జునుడు ఖాండవవనం మీదనేగాక, దాన్ని దాటి అన్ని పక్కలా చాలా మేర వానచినుకు అన్నది పడటానికి వీలు లేకుండా బాణాలతో పందిరి నిర్మించాడు. ఖాండవవనం తగలబడి పోవటానికి ఏ అంతరాయమూ లేకపోయింది.

కృష్ణార్జునుల సహాయంతో ఈసారి అగ్నిహోత్రుడు వనాన్ని పూర్తిగా దగ్ధం చేస్తాడని రూఢి కాగానే, ఆ వనానికి ఎంతో కాలంగా రక్షకుడుగా ఉంటూ ఉండిన తక్షకుడు చల్లగా వనాన్ని వదిలిపెట్టి కురుక్షేత్రానికి చేరుకున్నాడు.

తక్షకుడి కొడుకు అశ్వసేనుడు అనేవాడు తన తల్లి చాటున వనం విడిచి పోతూండగా అర్జునుడు గమనించి, అశ్వసేనుడి తల్లి తలనూ, అశ్వసేనుడి తోకనూ బాణాలతో నరికాడు. తోక తెగినా, ప్రాణాలతో అశ్వసేనుడు తప్పించుకున్నాడు.

తరవాత ఇంద్రుడికీ, అర్జునుడికీ ఘోరమైన యుద్ధం జరిగింది. కాని ఇంద్రుడు అర్జునుణ్ణి జయించలేకపోయాడు. ఖాండవ



వనాన్ని ఆశ్రయించుకుని ఉన్న రాక్షసులు కొందరు యుద్ధానికిరాగా, కృష్ణుడు వారిని తన చక్రంతో చంపేశాడు. మయుడనే రాక్షసుడు తప్పించుకు పారిపోతుంటే కృష్ణుడు వాణ్ణి చంపబోతే, మయుడు అర్జునుణ్ణి శరణుజొచ్చాడు.

ఖాండవవనాన్ని అగ్నిహోత్రుడు పదిహేను రోజులపాటు దహించాడు. అందులో ఉన్న ప్రాణికోటి కూడా వనంతోపాటు కాలిపోయింది. అందులో చావకుండా బతికినవారు ఎవరంటే, తక్షకుడూ, అతని కొడుకు అశ్వసేనుడూ, మయుడూ, శార్ఙ్గకులు నలుగురూనూ.





ఈ శార్ఙ్గకులు మందపాలు డనే ముని సంతానం. మందపాలుడు బ్రహ్మచర్య వ్రతం అవలంబించి చాలాకాలం తపస్సు చేసి, తన యోగశక్తితో స్వర్గానికి వెళ్ళాడు. కాని అతనికి స్వర్గంలో సుఖం కలగలేదు. అన్ని సుఖాలూ ఇవ్వదగిన స్వర్గం తనకు సుఖంగా ఎందుకు లేదని మందపాలుడు అక్కడి దేవతలను అడిగాడు.

దానికి దేవతలు, "నువు తపస్సు చేసి దేవ ఋణం తీర్చావుగాని, సంతానం పొంది పితరుల ఋణం తీర్చలేదు. అందుకే ఈ స్వర్గంలో నీకు సుఖం లేకుండా ఉన్నది," అని జవాబు చెప్పారు.

అప్పుడు మందపాలుడు పక్షులకు త్వరగా సంతాన ప్రాప్తి కలుగుతుందిగదా అని, శార్ఙ్గపక్షి రూపం ధరించి, జరిత అనే పెంటి పక్షికి నలుగురు పిల్లలను కన్నాడు. తరవాత అతను తన ఆశ్రమానికి తిరిగి పోయి, లపిత అనే భార్యతో మామూలుగా సంసారం చెయ్యసాగాడు.

అలా ఉండగా ఒకనాడు మందపాలుడికి, ఖాండవవనాన్ని దహించటానికి పోతున్న అగ్ని కనిపించాడు. ఆయన తన శక్తితో అగ్ని ఉద్దేశం గ్రహించి, "అగ్ని హోత్రుడా, ఖాండవవనంలో నా బిడ్డ లున్నారు. వారిని మాత్రం చావనీకు," అన్నాడు. దానికి అగ్ని అంగీకరించాడు. ఆ కారణంగా శార్ఙ్గకులు నలుగురూ ప్రాణాలతో బయటపడ్డారు.

ఏమైతేనేం, ఖాండవవనం పూర్తిగా తగల బడిపోయింది. అగ్నిదేవుడి అజీర్తి బాధ నివారణ అయింది. ఆయన, తనకు సహాయ పడిన కృష్ణార్జునులను దీవించి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఇంద్రుడు కూడా కృష్ణార్జునుల శక్తి సామర్థ్యాలకు మెచ్చి, దేవతలతో సహా వారి ముందు ప్రత్యక్షమయాడు. వారు ఇంద్రుడికి నమస్కారం చేశారు. ఇంద్రుడు వరం







కోరుకోమంటే, అర్జునుడు దివ్యాస్త్రాలు యివ్వమని కోరాడు.

"నీకు మహేశ్వరుడు ప్రత్యక్షమవుతాడు. అప్పుడు నేను నీకు దివ్యాస్త్రాలిస్తాను," అని ఇంద్రుడు అర్జునుడికి చెప్పి, కృష్ణార్జునుల స్నేహం శాశ్వతంగా ఉండేటట్టు దీవించి, దేవతలతో సహా స్వర్గానికి తిరిగి వెళ్ళిపోయాడు.

తరవాత కృష్ణార్జునులు యమునా తీరాన తమ విహారస్థలానికి తిరిగి వచ్చారు. వారి వెంట మయుడు కూడా వచ్చాడు. మయుడు అర్జునుడికి నమస్కారం చేసి, "మహాత్మా, మీ దయచేతనే నేను ఖాండవవనం నుంచి ప్రాణాలతో బయటపడ్డాను. ఈ కృష్ణుడు గాని, అగ్నిహోత్రుడు గాని నన్ను దహించటానికి వెనకాడి ఉండరు. నేను మీకు ఏ విధంగా ప్రత్యుపకారం చెయ్యను? నేను రాక్షసుల విశ్వకర్మను. అందుచేత మీరేది కోరితే అది నిర్మించి పోదామనుకుంటున్నాను. అందుచేత మీ కోరిక ఏమిటో తెలపండి," అన్నాడు.

అర్జునుడు ఏమీ కోరక, "నీ స్నేహభావం మాకు చాలు," అన్నాడు. కాని మయుడు ఏదన్నా నిర్మించి ఇస్తానని పట్టుబట్టాడు. అందుచేత అర్జునుడు కృష్ణుడి సలహా అడిగాడు.

కృష్ణుడు కొంచెం ఆలోచించి మయుడితో, "ధర్మరాజుకు ఒక ప్రశస్తమైన సభ నిర్మించి ఇయ్యి. అది చాలా అందంగా ఉండాలి. దివ్య ప్రభావం గలదిగా ఉండాలి," అన్నాడు.

అందుకు మయుడు సమ్మతించాడు. కృష్ణార్జునులు మయుడితో సహా ఇంద్రప్రస్థానికి తిరిగి వచ్చి, ధర్మరాజుకు ఖాండవవన దహనం గురించి అంతా చెప్పారు. మయుణ్ణి అర్జునుడు ఏవిధంగా అగ్ని నుంచి కాపాడినదీ, అందుకు ప్రత్యుపకారంగా మయుడు ఎలా సభను నిర్మిస్తానన్నదీ కూడా ధర్మ

రాజు తెలుసుకుని, సంతోషించి, మయుడికి తగిన సత్కారం చేశాడు.

తరవాత మయుడు ఒక శుభదినాన మంగళస్నానం చేసి, బ్రాహ్మణులకు సంతర్పణ చేసి, ఎటు చూసినా పదివేల జానలుండే నలుచదరపు స్థలంలో సభాభవనం నిర్మించటానికి ఉపక్రమించాడు.

ఈ సమయంలోనే కృష్ణుడు ద్వారకకు తిరుగు ప్రయాణమైనాడు. అర్జునుడు ఎక్కివచ్చిన రథం మీదనే అతను తిరిగి వెళ్ళాడు. పాండవులు అతన్ని చాలా దూరం సాగనంపారు.



కొద్దికాలానికి మయుడు సభానిర్మాణం పూర్తిచేశాడు. అతను ఒకప్పుడు వృషపర్వుడనే రాక్షసరాజుకు సభను నిర్మింతామనే ఉద్దేశంతో బిందుసరోవరం తీరాన వివిధ మణిమయ పదార్థాలు దాచి ఉంచాడు. అక్కడనే వృషపర్వుడు తన సాటిలేని గదను కూడా దాచి వుంచాడు. వరుణుడి శంఖం దేవదత్తం కూడా అక్కడ ఉంచిన సామగ్రిలో ఉన్నది. మయుడు ఆ గదను భీముడికీ, శంఖాన్ని అర్జునుడికీ తెచ్చి ఇచ్చాడు.

ఇక సభను మయుడు తయారుచేసిన పద్ధతి అత్యద్భుతమైనది. అందులో మయుడు కొన్ని సరోవరాలు కట్టాడు. వాటి గోడలకు రత్నాలూ, ఆకులకు వైడూర్యాలూ, మెట్లకు స్ఫటికాలూ అమర్చాడు. బంగారంతో చేసిన కమలాలూ, తాబేళ్ళూ, చేపలూ ఏర్పాటుచేశాడు. నీటి భాగానికీ, నేల భాగానికీ తేడా కనపడకుండా చేశాడు. సభ అంతటా దూలాలకూ, స్తంభాలకూ, గోడలకూ, అరుగులకూ మణులు అమర్చాడు. ఆ సభలో అనేక రకాల ఆకర్షణలున్నాయి. చూసేవారికి అనేక రకాలభ్రమలు కలుగుతాయి.

లోకోత్తరమైన ఈ సభను తయారుచేసి ఇచ్చిన మయుడికి ధర్మరాజు తగిన

సన్మానంచేసి పంపేశాడు. తరవాత ఆయన పదివేల మంది బ్రాహ్మణులకు సంతర్పణా, సమారాధనా చేసి, దానా లిచ్చి, వారి ఆశీ ర్వాదాలు పొంది, తన తమ్ములతో సహా మయసభ ప్రవేశించాడు.

అనేక దేశాలరాజులు ధర్మరాజు గొప్ప తనాన్ని ఆమోదించి, అతనికి గుర్రాలూ, బంగారు ఆభరణాలూ, మణులూ, అంద గత్తెలైన స్త్రీలూ, దాసదాసీలూ మొదలైన కానుకలు తెచ్చి సమర్పించారు. ఇలా కానుకలు తెచ్చినవారిలో అంగ, వంగ, కళింగ, ఆంధ్ర, పుండ్రక, కిరాత, మగధ, మత్స్య, మాళవ, కేకయ, కరూశ, కాంభోజ, మద్ర, పాండ్య మొదలైన దేశాల రాజులున్నారు.

అలాగే అనేకమంది ప్రసిద్ధులైన ఋషులు ధర్మరాజు సభకు వచ్చి, అనేక కథలు చెప్పారు. ఆ సమయంలో నార దుడు, పారిజాతుడు, రైవతుడు మొదలైన తన శిష్యులతో ధర్మరాజు సభకు వచ్చాడు. ధర్మరాజు భక్తితో నారదుడికి అర్ఘ్య పాద్యాలూ, ఆసనమూ, మధుపర్కాలూ ఇచ్చి సత్కరించాడు.

నారదముని ధర్మరాజుతో రాజు చేయ వలసిన అనేక పనులను గురించి మాట్లాడి, దిక్పాలకుల సభలను వర్ణించి చెప్పి, రాజ సూయయాగం చేసినవారికి స్వర్గం లభి స్తుందనీ, హరిశ్చంద్రుడి వంటి రాజులు ఆ యాగం చెయ్యటంచేతనే ఇంద్రలోకంలో ఉన్నారనీ చెప్పి, ఒక హెచ్చరిక కూడా చేశాడు. అదేమిటంటే—రాజసూయం నిర్వి ఘ్నంగా చేసినట్టయితే అపారమైన జన నష్టం కలిగించే యుద్ధం వస్తుంది.

ఈ హెచ్చరిక చేసి నారదుడు ధర్మ రాజుతో, ''రాజా, బాగా ఆలోచించి నీకు ఏది మేలని తోస్తే అది చెయ్యి.'' అని, ధర్మరాజు వద్ద సెలవు పుచ్చుకుని ద్వార కకు బయలుదేరి వెళ్ళిపోయాడు.





# బస్రా నావికుడు

## 3

అబుల్‌ఫవారిస్ దీర్ఘకాయు డిచ్చిన ఆహారంతో తన ఆకలి తీర్చుకున్నాడు.

"ఇక్కడ ఎంతసేపని ఉంటావు? మా యింటికి వచ్చి కాస్సేపు విశ్రమించు," అంటూ ఆ దీర్ఘకాయుడు అబుల్‌ఫవారిస్‌ను వెంటబెట్టుకుని కొండ దిగాడు. అక్కడ ఒక ద్వారం ఉన్నది. దానికి అడ్డంగా ఒక కొండరాయి పెట్టి ఉన్నది. ఆ దీర్ఘకాయుడు ఆ రాయిలో ఉన్న ఒక కంతలో చెయ్యి దూర్చి ఎత్తి పక్కన పెట్టి, అబుల్‌ఫవారిస్‌ను లోపలికి పోనిచ్చాడు. అబుల్‌ఫవారిస్ ద్వారంలోకుండా లోపల ప్రవేశించగానే దీర్ఘకాయుడు ద్వారాన్ని తిరిగి రాతితో మూసి, తన పని మీద తాను వెళ్ళిపోయాడు.

అబుల్‌ఫవారిస్ ద్వారం దాటి ఒక అందమైన తోట ప్రవేశించాడు. దాని నిండా పళ్ల చెట్లున్నాయి. ఆ తోట మధ్య ఒక ఇల్లున్నది. దాని చుట్టుపక్కల చాలా గుడిసెలు కనిపించాయి.

అతను ఒక గుడిసెలో ప్రవేశించాడు. అక్కడ పదిమంది మనుషులున్నారు. వాళ్ళందరూ మోకాళ్ళ మీద తలలు వాల్చి ఏడుస్తున్నారు. వాళ్ళు తల లెత్తి చూసి, "ఎవరు నువు?" అని అడిగారు.

తనకు దీర్ఘకాయుడు అతిథ్య మిచ్చాడని అబుల్‌ఫవారిస్ వాళ్లతో అన్నాడు.

"నువు కూడా ఈ రాక్షసుడి చేతుల్లో చిక్కుకున్నావా? వాడు గొర్రెలకాపరి వేషంలో తిరుగుతూ మనుషులను పట్టుకుని తింటూ ఉంటాడు," అన్నారు వాళ్ళు.

అదే సమయంలో దీర్ఘకాయుడు ద్వారానికి అడ్డం పెట్టిన రాయి తొలగించి, తన గొర్రెలను తోటలోకి తోలి, మళ్ళీ ద్వారం మూసి, తన ఇంట ప్రవేశించాడు.





సాగాడు. అబుల్ ఫవారిస్ సులువుగా, వాడికి అందకుండా తప్పించుకున్నాడు. దీర్ఘకాయుడికి ఎంతసేపూ తన గొర్రెలే తగిలాయి. వాడు ద్వారానికి అడ్డం ఉన్న రాయి తీసేసి గొర్రెలను బయటికి తరిమాడు. అబుల్ ఫవారిస్ అక్కడ ఉన్న గొర్రెచర్మం ఒకటి మీద వేసుకుని గొర్రెలతోబాటు బయటికి పారిపోవటానికి ప్రయత్నించాడు, కాని బయటికి పోయే గొర్రెల వీపులు తడువుతున్న దీర్ఘకాయుడు కనిపెట్టేశాడు. ఐతే అబుల్ ఫవారిస్ తాను కప్పుకున్న గొర్రె తోలు రాక్షసుడి చేతిలో వదిలేసి, తాను సముద్రం కేసి పరుగుతీశాడు.

అందరి భోజనాలూ అయాక ఆ దీర్ఘకాయుడు ఆ మనుషులలో ఒకణ్ణి చంపి తిని, సారా తాగి, పడుకుని నిద్రపోయాడు.

అబుల్ ఫవారిస్ మిగిలిన వాళ్ళతో, "ఎలాగూ చావు తప్పదు. గనక నేనే వీణ్ణి చంపుతాను. మీరు కాస్త సహాయపడండి," అన్నాడు. కాని వాళ్ళు చెయ్యీ, కాలూ కదిపే స్థితిలో కూడా లేరు. అందుచేత అబుల్ ఫవారిస్ తానే నిప్పులో నుంచి రెండు కట్టెలను తీసి, వాటితో దీర్ఘకాయుడి కళ్లు రెండూ పొడిచేశాడు.

ఆ బాధతో ఆ రాక్షసుడు లేచి నిలబడి తన కళ్లు పొడిచిన వాడి కోసం తడవ

దీర్ఘకాయుడు అబుల్ ఫవారిస్‌ను వెంబడించి, నీటి దాకా వచ్చి ఆగిపోయాడు. వాడికి ఈత రాదు. అబుల్ ఫవారిస్ ప్రాణాలు అరచేత పట్టుకుని ఈదుతూ కొండ అవతలి పక్క చేరుకున్నాడు. అక్కడ ఒక ముసలివాడు కనిపించి, అబుల్ ఫవారిస్ వృత్తాంత మంతా విని అతన్ని తన ఇంటికి తీసుకుపోయాడు.

ఈ మనిషి కూడా నరభక్షకుడేనని తెలియగానే అబుల్ ఫవారిస్ హతాశుడయాడు. అయితే అతను ఆ ముసలివాడి భార్యను మంచి చేసుకుని, ఆమెకు ఇంటి

పనులలో సహాయపడటానికి ఒప్పుకున్నాడు. ముసలివాడు అతన్ని గొర్రెలు కాసే పనికి నియోగించాడు. అందుకోసం అతన్ని గొర్రెల కాపరి ఉండే చోటికి పంపారు.

ఒకనాడు అతను చెట్ల మధ్య తిరుగుతూ ఒక చెట్టు తొర్రలో పెద్ద తేనెపట్టు చూశాడు. ఆ రాత్రి అతను ఆ తేనెపట్టు గురించి గొర్రెలకాపరి భార్యతో చెప్పాడు. ఆమె మర్నాడు ఉదయం, తేనె తీసుకు రమ్మని అబుల్‌ఫవారిస్ వెంట గొర్రెలకాపరిని పంపింది. దారిలో అబుల్‌ఫవారిస్ ఆకస్మికంగా గొర్రెలకాపరి మీద పడి, వాణ్ణి ఒక చెట్టుకు కట్టేసి, తప్పించుకు పోవటానికి సముద్రంలోకి దూకి ఈదనారంభించాడు.

అతను చాలా గంటలపాటు ఈదిన మీదట అతని కొక ఓడ తగిలింది. ఓడలో వాళ్ళు అతన్ని చూసి, ఓడను అతని వేపు నడిపించి, అతన్ని ఎక్కించుకున్నారు. వాళ్ళకు అతను తన కథ అంతా ఉన్నది ఉన్నట్టు చెప్పాడు.

అదృష్టవశాన ఆ ఓడ తిన్నగా బస్రాకే పోతున్నది. అబుల్‌ఫవారిస్ ఒక నెలకు ఇల్లు చేరుకుని, తన వాళ్ళను తిరిగి కలుసుకున్నాడు. అప్పటికి అతని తల పూర్తిగా నెరిసిపోయింది.



అతను కొంత కాలం ఇల్లు కదలకుండా విశ్రాంతి తీసుకుని, ఒకనాటి ఉదయం సముద్రతీరాన షికార్లు చేస్తూండగా, మొదట తన ఓడను కిరాయికి తీసుకున్న ముసలి వాడే కనిపించాడు.

వాడు అబుల్‌ఫవారిస్‌ను గుర్తించక, "నీ ఓడను ఆరుమాసాల పాటు కిరాయి కిస్తావా?" అని అడిగాడు. వెనక అడిగినట్టే అబుల్‌ఫవారిస్ వెయ్యి బంగారు దీనారాలు అడిగాడు. ముసలివాడు డబ్బు చెల్లించి, మర్నాడు వస్తానని వెళ్ళిపోయాడు.

మర్నాడు అబుల్‌ఫవారిస్ తన ఓడలో ముసలివాణ్ణీ, వాడి నౌకరునూ, సంచీలనూ

ఎక్కించుకుని ప్రయాణమయాడు. మూడు నెలలు సముద్రయానం చేసి వాళ్ళు ముత్యా లుండే దీవిని చేరారు; ఓడను సముద్ర తీరాన ఉంచి, సంచీలతో సహా కొండపైకి ఎక్కారు.

వెనకటి లాగే ముసలివాడు అబుల్ ఫవారిస్‌ను గోతులలోకి దిగి ముత్యపు చిప్పలు తోడమన్నాడు.

"నాకు దిగటానికి భయంగా ఉంది," అన్నాడు ఫవారిస్.

"అపాయం ఉంటే నిన్ను దిగమంటానా? ఏమీ భయుం లేదు. దిగు!" అన్నాడు ముసలివాడు.

అబుల్ ఫవారిస్ మొండికెత్తాడు.

తప్పేది లేక ముసలివాడు ఒక గోతిలోకి తానే దిగి, తట్టలో ముత్యపుచిప్పలు పైకి పంపుతూ, "చూశావా? ఏమీ అపాయం లేదు! నన్ను పైకి లాగు. ముసలివాణ్ణి. ఒంట్లో శక్తిలేదు," అన్నాడు.

"దిగనే దిగావు గనక, ఈ రోజుకు నువే పనిచెయ్యి. రేపు నేను దిగి ఓడ నిండేటట్టు ముత్యపుచిప్పలు తీస్తాను," అన్నాడు అబుల్ ఫవారిస్ ముసలివాడితో.

ముసలివాడు చాలా సేపు ముత్యపు చిప్పలు పైకి పంపి, "బాబూ, ఇక నా వల్ల కాదు. అలసిపోయాను," అన్నాడు.

"ఇప్పుడు నీకు తెలిసివచ్చిందా, ముసలి పీనుగా! ఒకనాడు నన్ను ఇదే స్థితిలో ఇక్కడి గుంటల్లో వదిలిపోయావు. నా పేరు అబుల్ ఫవారిస్. ఎందరినో ఇలా చంపావు. దేవుడి దయవల్ల నేను బతికి బయటపడ్డాను. నీ మూలంగా చచ్చిన వారందరినీ గుర్తు తెచ్చుకో," అని అబుల్ ఫవారిస్, ముసలి వాడున్న గోతి మీద ఒక పెద్ద రాయి కప్పి, నౌకరు చేత ముత్యపుచిప్పలు మోయించి తెచ్చి, తన ఓడలో వేయించి, ఇంటికి తిరిగి వచ్చి, నావికుడి జీవితం మానేసి, సుఖంగా జీవించాడు. —(అయిపోయింది)



# 107. ప్రాచీన క్రీడారంగం

అమ్మాన్ (జోర్డాన్) నగరంలో 1800 ఏళ్ళ క్రితం రోమనులు ఈ క్రీడారంగాన్ని నిర్మించారు. ఇందులో 4,000 మంది ప్రేక్షకులు కూర్చునేటందుకు వీలుండేది. గ్లాడియేటర్లు అనే క్రీడాకారులు ఇక్కడ ద్వంద్వయుద్ధాలు చేసేవారు. సింహాల వంటి క్రూరమృగాలతో పోరాటాలు జరిగేవి. ఆ కాలంలో అమ్మాన్ పేరు ఫిలడల్ఫియా. శిథిలమైపోయిన ఈ క్రీడారంగంలో కాందిశీకులు తల దాచుకుంటూ వచ్చారు.



Photo by P. Balaji Rao



బహుమతి
పొందిన వ్యాఖ్య

ముగ్గురి కొకడే మూలం

పంపినవారు:
డి.ఎస్. మూర్తి, ఆమదాలవలస

Photo by P. Balaji Rao



బహుమతి
పొందిన వ్యాఖ్య

ముడుకుల పైనే భారం

పంపినవారు :
డి.ఎస్. మూర్తి, ఆముదాలవలస

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1970 డిసెంబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి)

★ అక్టోబర్ నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ముగ్గురి కొకడే మూలం

రెండవ ఫోటో : ముడుకుల పైనే భారం

పంపినవారు : డి. శ్రీరామమూర్తి,
అమదాలవలస. (విశాఖ జిల్లా)

బహుమతి మొత్తం రు. 20/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# మీ అభిమాన 'చందమామ'కు

నవంబరు నుంచి

## కొత్త రూపం

నవంబరు (1970) నెల నుంచి 'చందమామ' పత్రిక కొత్త రూపం ధరించ బోతున్నది. పత్రికకు ఇప్పుడున్న 'పక్క కుట్టు కాకుండా - 'మధ్య కుట్టు' వస్తుంది. దీనివల్ల చదువు కోవడం, పుస్తకం పట్టుకోవడం సులువు అవుతాయి. 'మధ్య కుట్టు' సౌకర్యంవల్ల పత్రిక తొందరగా విడుదల కావడానికి కూడా ఆస్కారం ఉన్నది.

—ప్రకాశకులు


ఆనంద్‌కు ఇంచుమించు
స్కాలర్‌షిప్
పోయినంత పనైంది!


పరీక్ష రోజున...
ఆనంద్, పరీక్షలో
బాగా రాయాలి.
స్కాలర్‌షిప్
నిలబెట్టుకోవాలి.
గుర్తుంచుకో!


పరీక్ష హాల్లో...
బలే, పేపరు ఎంత
తేలిగ్గా ఉంది!


ఒక గంట తరవాత...
నా పెన్ను రాయటం
లేదు, ఏమైందో.


టైములో పూర్తి
చెయ్యటం ఎట్లా?


విచారించొద్దు, ఆనంద్.
ఈ కేమ్లిన్ పెన్ను, కేమెల్
సిరా తీసుకుని రాయి.


హా, ఈ సిరా బలే బాగా రాస్తోంది.
అక్షరాలు మెరుస్తున్నాయి కూడా.
టైములో రాయటం పూర్తి
చేస్తాను.


ఆనంద్ టైములో
పూర్తి చేశాడు...


పరీక్ష ఫలితాలు తెలిసిన రోజున...
శెబాష్ ఆనంద్
నా సమ్యాపు అభినందనలు


గుర్తుంచుకోండి, కేమెల్ సిరా
మరియు కేమ్లిన్ పెన్ను
సాఫీగా రాస్తాయి.
ఎప్పుడు కేమెల్‌యే
కావాలనండి.
uxe ink
ROYAL BLUE









SQUIBB
Phosfomin
MULTIPLE GLYCEROPHOSPHATES & B COMPLEX
VITAMINS ELIXIR
Phosfomin
VITAMINS ELIXIR




ప్రొడ్యూసర్స్ కంబైన్

# ఇద్దరు అమ్మాయిలు

ఈస్ట్‌మన్ కలర్ - జెమిని



స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: పుట్టణ్ణ   రచన డి.వి.నరసరాజు బి.ఏ.,   సంగీతం కె.వి.మహాదేవన్   నవయుగ

